# బాపురెడ్డి భావగీతాలు

రచన

డా॥ జె. బాపురెడ్డి

జయం పబ్లికేషన్స్
హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్

# బాపురెడ్డి భావగీతాలు

రచన

డా॥ జె. బాపురెడ్డి

జయం పబ్లికేషన్సు
హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్

**BAPU REDDY BHAVA GEETALU** (lyrics)
by **Dr. J. Bapu Reddy**



*First Edition* : 1997

*Price* : **Rs. 60/-**
**US $ 10**

*Cover Design* :
**SREE BALAJEE GRAPHICS**
Hyd. Ph. 7603416

*Published by* :
**JAYAM PUBLICATIONS**
Plot 10, Road - 5,
Jubilee Hills, Hyderabad - 500 033.

*Copies available at:*
**VISALANDHRA PUBLISHING HOUSE**
Sultan Bazar, Hyderabad.
**ANDHRA SARASWATHA PARISHATH**
Boggulakunta, Hyderabad.
**NAVODAYA BOOK SELLERS**
Kothi, Hyderabad.
**JAYAM PUBLICATIONS**
Jubilee Hills, Hyderabad.

*Printed at* :
**VIPLA PRINTERS**
Nallakunta, Hyderabad - 500 044.
Ph : 7636242.

*Composed by* :
**SREE DATTASAI GRAPHICS**
1-8-702/105, Nallakunta,
Hyderabad - 500 044.
Ph : 7633275, 3020719.

# అంకితం

కృతికర్త – జె. బాపురెడ్డి     కృతి స్వీకర్తలు శ్రీమతి కె. సుచరిత – డా॥ కె. జయచంద్రారెడ్డి దంపతులు

విశాఖపట్నం నుంచి మాంచెస్టర్ వరకు
కుటుంబ స్థాయిలో అవిచ్ఛిన్న ధారయై వర్ధిల్లుతున్న
మా ఆత్మీయతకు పరస్పర శ్రేయోభిలాషిత్వానికి
అక్షర ప్రతీకగా ఆనంద పతాకగా
ఈ నా కవితానుభూతుల **భావగీతాలను**
ఐరోపా ఖండములోని తెలుగువారి
భాషా సంస్కృతుల పరిపుష్టికి పాటుపడుతున్న
ప్రతిభాశీలురు, త్యాగశీలురు,
శ్రీమతి కె. సుచరితా రెడ్డి – డా॥ కె. జయచంద్రారెడ్డి *(U.K.)*
ఆదర్శ దంపతులకు
అభినందనపూర్వక స్నేహోపాయనంగా
అంకితం చేస్తున్నాను.

**జె. బాపురెడ్డి**

# మనసులోని మాట

నేను పద్యకవిత, గేయకవిత, వచన కవిత - మూడు ప్రక్రియల్లోనూ అభినివేశం, అభిమానం ఉన్న సమతావాదిని. కవితా రూపం కంటే కవితాత్మను నమ్ముకున్న సాహితీ కృషీవలున్ని. అందుకు నేను లోకానికి అర్పించిన సుమారు పాతిక కవితా సంపుటాలే సాక్షాలు. "అయ్యయ్యో నేనొక్క ఘోర వార్తను వింటి" అనే గేయచరణంతో పసితనంలో ప్రారంభించిన నా కవితా ప్రస్థానం "కాలం మాయాజాలం" అనే సత్యస్ఫూర్తి దాక సాగి మొన్నమొన్ననే నా జీవిత షష్టి పూర్తిని జరిపించింది. షష్టి పూర్తి తర్వాత వెలువడుతున్న తొలి కవితా సంపుటి ఈ "భావగీతాలు" కావడం నాకెంతో సంతోషాన్ని, సంతృప్తిని కలిగించింది. లయాత్మకము, నియమబద్ధమూ అయిన తేజోమయ గేయచరణాలే నా జీవితశేషాన్ని ఆనందమార్గంలో నడిపిస్తాయని ఆశిస్తున్నాను.

ఒక్కొక్క కవితా ప్రక్రియ ఒక్కొక్క రకమైన భావాభివ్యక్తికి ఎక్కువ అనుకూలంగా ఉంటుంది. కవితలో భావాన్ని తదభివ్యక్తి నుండి విడదీయలేం. అందుకే రసానుభూతిని అందించే 'కవితా పరిభాష' ను అంత సులువుగా అనువదించలేకపోవటం. అయితే గానయోగ్యమైన, సంగీత నృత్య ప్రదర్శనీయమైన గేయకవిత ప్రజాదరణ పొందుతున్న కాలం ఇది. రేడియో, దూరదర్శన్, వెండితెర వంటి మాధ్యమాల ద్వార "పాట"ను భావావేశాన్ని అందించే ప్రక్రియగా వాడుకుంటున్న సంగతి మనం గమనిస్తున్నదే. మరి తలాతోకాలేని పాడిపాడి గజిబిజి మాటల్ని కూడా పాటలుగా పాడిస్తున్న నేటి "సంగీత మాయాజాలం" సంగతి ఏమిటంటారా! - దాన్ని ప్రస్తుతం అప్రస్తుతంగా ప్రక్కకు పెడదాం. "సత్యమేవ జయతే" అన్నట్లు సరస భావగీత మేవ జయతే అని సరిపెట్టుకుందాం.

నేను ఇంతవరకు రచించిన భావగీతాలు ముఖ్యంగా మూడు సంపుటాలుగా వెలువడ్డాయి. నాదేశం నవ్వుతూంది, ప్రేమారామం, శ్రీకారశిఖరం : సామాజిక స్పృహకు, ప్రణయతత్వానికి, ఆధ్యాత్మిక చింతనకు వరుసగా అవి ప్రతీకలు. ఈ "బాపురెడ్డి భావగీతాలు" సంపుటి ఈ మూడు భావధారలు రసానంద

సౌందర్యానుభూతికి అభిముఖంగా సాగిపోయే సత్యసాహిత్య చేతనా భావధారలే. ఆబాలగోపాలం చదువుకొని స్పందించి ఆనందించడానికి అణువుగానే కాకుండా ఈ గీతాలు చిత్రీకరణకు, నర్తనకు (నాట్యీకరణకు) కూడా యోగ్యంగా ఉన్నాయని భావిస్తున్నాను. యువతీ యువకులకు, విద్యార్థినీ విద్యార్థులకు, గాయనీ, గాయకులకు ఈ లలిత గీతాలు ఉపయుక్తంగా, సంగీత సాహిత్యాభిరుచి కారకంగా ఉండగలవని నా విశ్వాసం.

ఈ కృతి స్వీకృతిత్వానికి అంగీకరించి నాకు ఎనలేని ప్రమోదాన్ని, సంతృప్తిని ప్రసాదించిన నా చిరకాల మిత్రుల శ్రీమతి కె. సుచరితారెడ్డి, డా॥ కె. జయచంద్రారెడ్డి దంపతులకు నాహృదయపూర్వక కృతజ్ఞతలు. వారు స్నేహశీలతకు, త్యాగశీలతకు ప్రతిరూపాలుగా జీవిస్తూ ఆదర్శదంపతులుగా, మార్గదర్శక పౌరులుగా గౌరవింపబడడం ప్రశంసనీయం. శ్రీమతి సుచరితారెడ్డి గారు "ఐరోపా తెలుసు సమితి, వ్యవస్థాపక సభ్యురాలుగా, ఉపాధ్యక్షురాలుగా, అధ్యక్షురాలుగా, ప్రపంచతెలుగు సమాఖ్య (W.T.F) కార్యనిర్వాహకురాలిగా అందించిన సేవలు అపారమైనవి. తన భర్త వినయశీలి, ప్రతిభాశాలి డా॥ కోటిరెడ్డి జయచంద్రా రెడ్డితో అన్యోన్యంగా కలిసి తెలుగు వారికీ, భారతీయ సంస్కృతికి అంకితభావంతో తోడ్పడుతున్న తీరు ఆమెకు అంతర్జాతీయ కీర్తి నార్జించి పెట్టింది. ఈ ధర్మదంపతులు ఇతోధికంగా విశ్వసాంస్కృతిక వికాసానికి, మహోన్నత మానవతా విలువల పరిరక్షణకు కృషిచేస్తూనే ఉండాలని ఆకాంక్షిస్తున్నాను.

ఈ కవితా సంపుటికి 'లావణ్య పదబంధాలు' పేరుతో తిలకం దిద్దిన సుప్రసిద్ధ సాహితీమూర్తి, పరిశోధకులు, విమర్శకులు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారికి నాకృతజ్ఞతాభివందనాలు. సద్గుణశీలి, బహుముఖ ప్రతిభాశాలియైన ఆచార్య జీనియస్‌తో నాకు ప్రాప్తించిన చిరకాల స్నేహం, సాహితీ బాంధవ్యం ఒక మరుపురాని మధురానుభూతి. ఆయన సుహృద్వాక్కులు నాలోని శక్తి ప్రేరక బుక్కులుగా స్వీకరిస్తున్నాను. నా సాహితీ వికాసానికి సర్వవిధాల తోడ్పడుతున్న పూజ్యులు జ్ఞాన పీఠ పురస్కార గ్రహీతలు ఆచార్య సి. నారాయణ రెడ్డి గారికి నేను సర్వదా కృతజ్ఞుణ్ణి. ఆత్మీయులు శ్రీ ఎ.వి.యస్. రాజు, శ్రీ ఎస్. కొండలరావు, శ్రీ S. రాధాస్వామి, శ్రీ జి.ఎస్. ప్రకాశరావు, శ్రీ పి. మహేందర్‌రెడ్డి, శ్రీ జె. బాలాజి (U.S.A.) శ్రీ ద్వారంపుడి సుబ్బిరెడ్డి (U.K.), ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి, ఆచార్య S.S. ప్రభాకరరావు,

ఆచార్య అమీరొద్దీన్, డా॥ కృష్ణశ్రీనివాస్ (చెన్నై), డా॥ భీమ్‌సేన్ నిర్మల్, శ్రీ R.P.సంగ్ (IAS) ఆచార్య S.V. రామారావు, డా॥ సోనియాగుప్త వంటి ఆప్తమిత్రులకు, సాహితీ బంధువులకు నా ప్రగాఢ కృతజ్ఞతాంజలి.

ఈ పుస్తకాన్ని అంతర్జాతీయ ప్రమాణాలతో ముద్రించిన విప్ల ప్రింటర్స్ ప్రయివేట్ లిమిటెడ్ వారికి ముఖ్యంగా శ్రీయుతులు విజయసేనారెడ్డి జె. మారుతి గారలకు నా కృతజ్ఞతలు. పుస్తకాన్ని సుందరంగా కంపోజ్ చేసినందుకు దత్తసాయి గ్రాఫిక్స్ వారికి ముఖ్యంగా శ్రీమతి వి. యస్. లక్ష్మి గారికి ప్రత్యేక అభినందనలు.

నా సాహిత్య యాత్రలో మౌనపాత్ర వహిస్తూ, సాధక బాధకాలను సహిస్తూ నాకు చేదోడు వాదోడుగా వ్యవహరిస్తున్న నా సహధర్మచారిణి రాజేశ్వరికి ప్రశంసా పూర్వక ధన్యవాదాలు.

- బాపురెడ్డి

# లావణ్య పదబంధాలు

బాపురెడ్డి భావగీతాలు చదవగానే నాకు శ్రీనాథుని చాటుకవితలు స్మృతిపథంలో నిలిచాయి. శ్రీనాథుడు ప్రౌఢకవి. నైషధాబ్జభవుడు. తెలుగులో మహాకావ్య కవితకు మణితోరణాలు కట్టినవాడు. వైదర్భీ రీతికి రసజీవిత వైభవాన్ని అందించిన వాడు. ఆయన గంటం పట్టితే గడుసరి కవిత్వం; గళం విప్పి ఆశువుగా పలికితే చతురమైన చాటుకవిత్వం, విద్వత్సభలకోసం రాసేది కావ్య కవిత. విరామ సమయాల్లో విలాసంగా చిలికించేది చాటుకవిత. పల్నాటిని గురించి, చూచిన పలురకాల వనితల రూప లావణ్య విలాసాలగురించి, చెలిమికాంౘ్ర గురించి, ఆశలు ఆశయాల గురించి, కష్టనిష్ఠురాలగురించి - ఇలా మనసులో ప్రతిఫలించిన జీవిత రసబిందువులన్నింటి గురించి చిత్ర విచిత్రంగా మధురఫణితిలో ఆస్వాదయోగ్యంగా మన కందించాడు చాటు కవితలు.

డా॥ జె. బాపురెడ్డిగారు సహజంగా సీరియస్ కవి. అటు పద్యాన్నిగానీ, వచన కవితనుగానీ, గేయ కవితనుగానీ బింకంగా, పొంకంగా రచించటంలో చేయి తిరిగిన శిల్పి. పద్యకవిత్వంలోనే ప్రౌఢరచన చేసిన శ్రీనాథాది కవులు పద్యంలోనే చాటుకవిత్వం లేదా విరామకవిత్వం లేదా వినోద కవిత్వం రాసేవారు. ఆధునిక యుగంలో పద్య వచనగేయ రచనంలో ప్రౌఢులయిన కవులు అప్పుడప్పుడు ఆశుపద్యాలకు బదులు లలిత గీతాలను రాయటం బాగా ప్రాచుర్యంలోకి వచ్చింది. డా॥ జె. బాపురెడ్డిగారి భావగీతాలు వారి విరామారామ కవితా విలాస వసంతాలు.

శ్రీనాథాదుల చాటుపద్యాలు ప్రజల నాల్కలమీద లాస్యం చేయటానికి అనువైనవి. అలాగే ఆధునిక గేయకవులు రాస్తున్న లలితగీతాలు బృందగానాలుగా యుగళయుక్తగానాలుగా పాడుకోటానికి పసందుగా ఉండేవి. తెలుగు సాహిత్యంలో ఎన్నో వేలపద్యాలు ఆశువులుగా, చాటువులుగా ప్రజలలో ప్రవేశిస్తే అందులో కాలగతిలో ఎన్నో కనుమరుగైపోగా కొన్ని మాత్రమే తరతరాల సాహితీ జీవన స్రవంతిలో బ్రతికి బట్ట కడుతూ ఉంటాయి. అలాగే ఈ రోజుల్లో వెలువడుతున్న లలితగీతాలు కూడా!

"రాసుకున్న పాటలన్ని వాసికెక్కవు
నాటుకున్న మొక్కలన్ని రాశికెక్కవు" (పు.94)

అని అంటున్న బాపురెడ్డిగారి సూక్తి అక్షరాలా నిజం

బాపురెడ్డి భావగీతాలు వారి అనుభవాల, భావాల, స్వభావాల అక్షర స్పందనలు. ఇవి ఆలోచించి అక్షరం అక్షరం శిల్పించి చిక్కగా చిత్రించిన ప్రయోగ ప్రౌఢ వైచిత్రులు కాకపోవచ్చు అయినా అనుభవాని కందిన అనుభావాలను అలవోకగా కీర్తించి రమించే రచనతో రూపు కట్టించిన భావచిత్రాలు. పాడుతూంటేనే - లేదా - అలపిస్తూంటేనే - లేదా - చదువుతూ ఉంటేనే తనతోపాటు పఠితను కూడా పారవశ్యంతో వెంట నడిపించుకొని వెళ్లే సారళ్యం, వైరళ్యం, మాధుర్యం ఈ గీతాలకు సహజంగా సమకూరిన మూడుగుణాలు.

ఈ సంపుటిలో 108 భావగీతాలు ఉన్నాయి. మకుటంకాని ముద్రగాని ఉంటే గీత శతకం అయిఉండేది. ఈ కవితా సంపుటి శీర్షికలోని 'భావగీతాలు' అంటే - అలనాటి భావ కవితాయుగంలోని కృష్ణశాస్త్రి ప్రభృతుల భావగీతాల వంటివి కావని మొదట మనం గుర్తించాలి. ఆత్మీయత, ఆత్మాశ్రయత్వం, ఆత్మనాయకత్వం - అనేవి భావకవితాయుగ గీతాలలో ముప్పేటగా పెనవేసుకొని ఉంటాయి. విశ్వనాథవారన్నట్లు - "కవియొక్క ఒక అవిస్పష్టవాంఛాంకురము, ఒక అంతర్నిగూఢ తాపము, ఒక చిన్న కావ్యంలో ఊదబడటం" భావగీత లక్షణం. బాపురెడ్డి భావగీతాలలో ఆత్మాశ్రయత్వం ఎంత ఉందో వస్తు వర్ణనంకూడా అంత ఉంది. అంతర్నిగూఢ తాపంకంటె ఆత్మీయత యొక్క సాంద్రమైన ఆర్ద్రత ఎక్కువగా కనపడుతుంది.

భావకవితా గీతాలలో ప్రణయం ప్రధాన తతత్త్వంగా ప్రతిపాదిత మౌతూ ఉంటుంది. బాపురెడ్డి భావగీతాలలో ప్రణయం, ప్రణవం, ప్రగతి అనే ప్రవృత్తి త్రయం త్రివేణీ సంగమంలా కలిసి మెలిసి ఉంటాయి. ఈ సంపుటిలోని భావగీతాలను ఈ మూడు శాఖలుగా విభజించి వివేచించవచ్చు. ఈ మూడింటి స్వరూప స్వభావాలను బట్టి వాటి తారతమ్యాన్ని గూడా అంచెనా వేయవచ్చు.

బాపురెడ్డిగారి ప్రణయశాఖలో శృంగార భావగీతాలే ఎక్కువ. అయితే శృంగారంలో మార్మికతా పరిమళాలను జోడించి కామవాసనలను కప్పివేయటం రెడ్డిగారి రచనాశిల్పం. ప్రియురాలి అపాదమస్తకం వర్ణించినా అనౌచిత్యం ఆవంతకూడా దొర్లదు.

"నీ అపాదవస్తకం - శృంగార కళా పుస్తకం
మరల మరలనే చదివాను - బోధపడక మతి కోల్పోయాను..
కటికచీకటులు సిగలో ముడిచి - నీకన్నులు వెలిగిస్తావు.
ఒంటిమీది స్వర్గాలను దాచి - కొంటె నవ్వు పడవేస్తావు".

ఇలా సాగుతుంది. ఇందులో వాచ్యార్థం కంటె వ్యంగ్యార్థం మధురం. వాచ్యార్థం అలంకారిక అబివ్యక్తిలో లవకుంఠితం అవుతుంది. అభివ్యక్తి నుండి ప్రతీయమాన మౌతున్న ధ్వని ఈ భావగీతాల శక్తి. అందువల్ల బాపురెడ్డిగారి భావగీతాలలో ప్రణయగీతాలు ప్రథమ తాంబూలం అందుకొంటాయి.

ఆ తరువాత పరిత హృదయాలకు హత్తుకొనేవి 'ప్రణవగీతాలు'. ప్రణవగీతా లంటే బాపురెడ్డి గారి పరిభాషలో భక్తి గీతాలు, తత్త్వగీతాలు, రెడ్డిగారు రక్తికెంత మోజుచూపుతారో భక్తి కంత మమత పంచుతారు. కనకమహాలక్ష్మి, సత్యసాయిబాబా మొదలైన భగవదంశాల మీద మంచి గీతాలున్నాయి. ఇందులో వాచ్యార్థాన్ని అలంకృతం చేయుటమనే పద్ధతి ప్రధానంగా కనపడుతుంది. అలంకృతమైన వాచ్యం చమత్కారాన్ని ఇస్తుంది. అందువలన ఈ శాఖను రెండోమెట్టులో ఉంచాను. అయినా మచ్చుకాక చరణం.

"విద్య వైద్యారోగ్య కల్పవృక్ష ప్రదాత!
భక్తజన బాధా విముక్త శక్తి ప్రదాత!
దేశకాలాతీత సుఖ జీవన విధాత!
శ్రీ సత్యసాయిబాబా కలియుగ విజేత!

ఈగీతం భక్తి భావ స్ఫోరకమైన రచన. ఇందులో వాస్తవాన్ని అలంకారం శోభామయం చేస్తోంది.

బాపురెడ్డి ప్రగతిగీతాలు సమాజశ్రేయస్సు కోసం ప్రభుత్వం అమలు జరిపే సంక్షేమ కార్యక్రమాలను గురించి ప్రచారం చేసే ప్రయోజనం కోసం రాసిన గీతాలు. వీటిలో వ్యంగ్యం గాని, భావచిత్రంగాని, అలంకారం గాని, వాస్తవాన్ని ప్రతిపాదించటానికి దీపకరణంగా తోడ్పడేదే. అలంకార చమత్కారం వాస్తవ స్పృహకు తోడ్పడే రచనాశిల్పం పై రెండింటి కంటె ఉదాత్త మైనది కాదు. కాని, ఇటువంటి గీతాల కీ మార్గమే ఎక్కువగా శరణ్యం! "అల్లా చెప్పిందల్లా" గీతం ఈకోవకు చక్కని ఉదాహరణ.

ఈ పాటలు హాయిగా పాడుకోటానికి, అభినయించడానికి రాసినవి. తాళగతి? ఒదిగిన లయ భాగవతాల్లో పుష్కలంగా ఉంది. అనుప్రాసల కోసం అంత్యప్రాసలకోసం, యతులకోసం, శ్రుతులకోసం ప్రత్యేకంగా పాటుపడి అర్థాన్ని త్యాగం చేయలేదు. కవి అలవోకగా ఏవైనా కుదిరితే వాటిని కాదనలేదు. ప్రత్నించేసి గీతాల్లో ప్రత్యేక ప్రౌఢ ప్రక్రియలను ప్రయోగించి పాటలకు ప్రజలకు దూరం చెయ్యలేదు. బాపురెడ్డిగారి పాటకు మాట చేదోడుగా (తాళంతో) వాదోడుగా (రాగంలో) ఉంటూ భావగీతాలకు ప్రాణం పోస్తోంది.

లలితాగాతాలుగా పాడుకొనే వీలున్న లావణ్యపద బంధాలు ఈ బాపురెడ్డి భావగీతాలు. చదవండి. పాడుకోండి పాడగా వినండి, ఆనందించండి. కవిని అభినందించండి.

- ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం

# ఈ సంపుటిలో.....

# గోదావరి తీరవాసినీ

గోదావరి తీరవాసినీ!
విద్యావీణా విలాసినీ!
సకలకళా కుసుమ హాసినీ!
వాసర సుర సుధా భాషిణీ!

కోవెలలో కూరుచుండి
కువలయమును పలికింతువు
వీణా తంత్రులు మీటుచు
విద్యలన్ని బోధింతువు -

స్రష్ట కీవు సృష్టిచేయు
దృష్టి ప్రసాదించినావు
అజ్ఞాన తమస్సు తొలిచి
ప్రజ్ఞానము పంచినావు -

శబ్దము నీవే తల్లీ
శక్తివి నీవే తల్లీ
భావము నీవే తల్లీ
జీవము నీవే తల్లీ! -

సరస్వతీ! అని కొందరు
శారదా! అని కొందరు
వాగ్దేవీ! అని కొందరు
వాణీ! అని కొందరు
పూజింతురు నిన్నందరు
పూర్ణ చిదానందమయీ!

# కనక మహాలక్ష్మి

కనక మహాలక్ష్మిని
కనులారా చూచువారి
కష్టాలు కడతేరుమ
అభీష్టాలు నెరవేరుమ -

వరలక్ష్మి కన్నులలో
వాత్సల్యం నెలకొన్నది
ఆ వరదాయిని చిరునవ్వుల
కరుణామృత మున్నది
ఆ చిన్మయి పద సన్నిధి
ఆనందము కొలువున్నది -

అమ్మలగన్న యమ్మ
అక్షరాల ఆయమ్మే!
వేయిరేకులై విరిసిన వైశాఖి ఆయమ్మే
ముగురమ్మలు ఒక్కటైన
మూర్తి మహాలక్ష్మమ్మే!

పసుపు కుంకుమలు ఒడిలో
పరవశించు పరమేశ్వరి
తేనెపాల ధారల్లో
తీర్థమాడు భువనేశ్వరి
భక్తి ప్రపత్తులకు మెచ్చి
శక్తు లిచ్చు ముక్తేశ్వరి -

# రామలక్ష్మీ కృష్ణ

రామలక్ష్మీ కృష్ణ రసయోగ సిద్ధిలో
కన్ను విప్పిన జీవ కణమునే నేను -

వీధిబడినుండి
వినువీధిగుడిదాక
బాటవేసిన
పక్షి పాటనే నేను -

గంగా తరంగిణి
కొంగుబట్టుకొని
పసిపాపవలె చిలుక
పలుకులు పలుకుచు
ఆనంద సింధువున
ఆడుకొన బోయేటి
ఆటపాటల సెలయేటినే నేను -

కాలతటమున కలల
అలలపై తేలుచు
కోరిన గమ్యము
చేరుకొన పయనించు
త్రోవ తెలియని వింతనావనే నేను -

సిరికొండ ఒడినుండి
శ్రీకార శిఖరము
చేరుకుంటున్న వంశీరవము నేను -

# మట్టి లేనిది

మట్టి లేనిది చెట్టు లేదు
చెట్టుమాత్రం మట్టి కాదు
చెట్టుకూ మట్టికీ మధ్య
జీవ బంధం తెలిసికో !

నింగి లేక నేల లేదు
నేలమాత్రం నింగి కాదు
నింగి నేలలు కలిపి నిలిచే
నిచ్చెనేదో తెలిసికో !

పూవు లేక తావి లేదు
తావిమాత్రం పూవు కాదు
పూవు తావులు కూడి పాడే
భావమేదో తెలిసికో !

నిప్పు లేక నీరు లేదు
నీరుమాత్రం నిప్పు కాదు
నీటి కడుపున నిదురపోయే
నిప్పు మర్మం తెలిసికో !

జననముంటే మరణమున్నది
మరణముంటే జననమున్నది
జనన మరణము లేని దేగతి
జన్మమొందెనొ తెలిసికో!

# కోకిల పాటల పరీక్ష

కోకిల పాటల పరీక్ష
కాకులు చేస్తుంటే
నవ్వుల పువ్వుల పరీక్ష
నాపరాళ్లు చేస్తున్నవి -

కోహమని ప్రశ్నించి
సోహమని ప్రవచించి
సాగిపోవు సత్యమును సమతా సాహిత్యమును
చీకాకులు ఏకాకులు చిన్నబుచ్చలేవులే !

గుండెమావి గుబాళింపు
ఎండమావి కే మెరుక
క్రొపరిపాడు పికము జాడ
గ్రుడ్డి బకము కేమెరుక -

తేలిపోవు మబ్బులగని
గోలచేయు బావికప్ప
పూలబ్రతుకు క్షణికమని
గేలిచేయు రాయిరప్ప -

గగనవీధి చుక్కకన్న
గాజుపెంకు పెద్దదని
వాదించే శ్రీకాకులు
వక్రబుద్ధి వర్ధనలు
వెలుగుతున్న లోకంలో
"వెలుగు" బ్రతుకగలదా!

# ఎక్కుపెట్టిన ధనువు

ఎక్కుపెట్టిన ధనువులా
ఎవరవో నీవు!
చంపబోకే వాడిచూపుల
శరములను విడిచి -

సైగ చేస్తే చాలు, నీకు
శరణు చొచ్చేము
మోవి కదిపిన చాలు నీ దరి
మూర్ఛపోయేము -

కరము లేపిన చాలు, లక్షల
వరములే కురియు
ఉరము ఊపితె చాలు, వాడని
పరువములు విరియు -

అడుగువేస్తే నీవు, అది నా
ఎడదపై పడుమ
శ్వాప తీస్తే నీవు, నా భయ
బంధములు విడుమ -

చక్కనౌ నీ వంపుసొంపుల
చిక్కెనా బ్రతుకు
సిగ్గుపడక కావవేని
చిటికలో చితుకు !

# సత్యానికి హత్యాగండం

సత్యానికి హత్యాగండం ఉందని అనుకోలేదు
శాంతికపోతం విద్వేషానికి బలియౌననుకోలేదు
జరగకూడనిది జరిగింది - జాతికి శోకం మిగిలింది -

పెరంబుదూరున అమానుషత్వం
ఫెళ్లున ప్రేలింది
రాగంపండిన దేశంనిండా రక్తం చిందింది
లోకం వాకం ఒకే గొంతుతో
భోరున ఏడ్చింది

భారతయుద్ధంలో అభిమన్యుని కూల్చిన మాదిరిగా
రాక్షసశక్తులు కుట్రచేసి ఊహించనిచందముగా
రాజకీయపు దుర్వ్యూహంలో
రాజీవుని కూల్చె
ఉదయసంధ్యలో తరుణభానుడు ఒరిగి అస్తమించె

ఆ మహనీయుని చితాభస్మమును దాచిన నదులన్నీ
అందిస్తున్నవి అతని భావనలు
అలల పాటలల్లీ
అమరువీరుని అభయహస్తమే తోడునీడ మనకు
విజయపథంలో ఆతని గమ్యం
మనము చేరువరకు

# శాంతియే ఇంటింటి దీపం

(బాలవాణి)

శాంతియే
ఇంటింటి దీపం
శాంతియే
మా కలల రూపం -

బలవంతు లెవ్వరైన
బలహీనులను పట్టి
బాధించనప్పుడే బ్రతుకురా శాంతి -

కలిమి గలవారలు
కష్టజీవులపట్ల
ప్రేమ చూపిననాడె పెంపొందు శాంతి -

స్వార్థాలు వీడితే
సమరాలు లేవు
సమరాలు లేనట్టి స్వర్గమే శాంతి

దోపిడీలు లేని
దౌరతనాలు లేని
సమతా మమతలలో వెలగాలి శాంతి
శాంతి విజయ శ్రేణియే విశ్వశాంతి !

# సప్తగిరి బాలాజీ!

సప్తగిరి బాలాజీ! శరణం శరణం
తొలగింపుము పెనుచీకటి మాయావరణం!

చదువులెన్ని చదువుకున్న సాధ్యపడని సత్యం
పదవులెన్ని పట్టుకున్న పట్టుపడని సౌఖ్యం
నీ పదసన్నిధిలోనే వెలసింది
నీ చిరునవ్వులలోనే మెరిసింది

జీవులన్నిటికి ముందే జన్మించిన శిలలు
జరామరణములు లేని పరమహంసలు
నుడివే నీ మౌనభాష నేర్పించుము నరులకు
అర్థములేనట్టి మాటలాడే పామరులకు

ఆపదలన్నిటినుంచి కాపాడే యుక్తి
అందరికీ సంపదలు అందించే శక్తి
నీ వజ్రకిరీటంలో నిక్షిప్తము స్వామీ!
నీ శివకర కరగతమే సర్వాంతర్యామీ!

అన్నమయ్యవంటి కవులు పాటలన్ని అల్లి
భక్తకోటి, కంటిచూపు పూవులన్ని చల్లి
సేవించే నీ చరణం నిర్భయ శరణం
పూజించే నీ వదనం సమతాసదనం -

# శ్రీరామచంద్రుణ్ణి

శ్రీరామచంద్రుణ్ణి ఏరు దాటించాలి
స్వామి పదసేవలో జన్మము తరించాలి -

రామ రామా అంటూ
రవళించు చెట్టేదో !
జానకీ రాముణ్ణి
ధ్యానించు కట్టేదో !
పసిగట్టి పరిక్రొత్త
పడవ నిర్మించాలి

పూలన్ని రామయ్య
పూజకై పూసేను
అడవి దారుల స్వాగ
తాంజలులు పట్టి
ఎపుడు విచ్చేయు నని
ఎదురు చూసేను

పక్షులన్నీ ఏటి గట్టుపై కూడేను
రామనామమె పెక్కు రాగాల పాడేను
మూగ మృగములుకూడ
మురిపెమున ఆడేను

(గుహుని భక్తి పారవశ్యం)

# పసుల పాకలో

పసుల పాకలో పుట్టిన శిశువు నీవు !
మరియమ్మ కలల తీవె విరివి నీవు !

బెత్లహాం మట్టిలో ప్రేమను పండించావు
అన్యాయాల ఎడారుల అమృతం కురిపించావు -
మనిషి మనిషిగా బ్రతికే మార్గం చూపెట్టావు
కామరూపి సైతానును
కనిపెట్టి జయించావు -

చుక్కవోలె ఉదయించి సూర్యుడ వైపోయావు
దేవదూతగా వచ్చి దేవుడ వైపోయావు -
పాపులను, పతితులను పరిశుద్ధులుగా మార్చి
రక్షకునే శిక్షించిన శిలువను పావనముచేసి
సత్యవాణి వైనావు
నిత్యదీప మైనావు -

మానవతను మతముచేసి
మనిషిని బైబిలుచేసి
దేశకాలముల వెలిగే
ఏసుక్రీస్తు వైనావు!

# అందాల తల్లి

## (బాలల గేయం)

అందాల తల్లి, ఆనంద వల్లి
ఎక్కడుంది శాంతి? ఏమంది శాంతి ?

మనిషి మనసులో ఉన్నది
మన మనుగడలో ఉన్నది
మతాలు వేరైనా మనుషులంత ఒకటన్నది
దేశాలు వేరైనా ఆశయాలు ఒకటన్నది -

ఈసు లేనిచోటే తన వాసమన్నది
స్వేచ్ఛాస్వాతంత్ర్యము తన శక్తి అన్నది -

మమతల పందిరిమీద మల్లెతీవ శాంతి
సమతల బ్రతుకుల్లో సౌభాగ్యం శాంతి

స్వార్థాలు లేకుంటే
సమరాలు లేవన్నది
దోపిడీలు లేకుంటే
హింసలు లేవన్నది
మనిషి మనిషి ప్రేమించే
మతమే తనపథ మన్నది
మార్గమే స్వర్గం అన్నది

# గండికోట

గండికోట ముంగిట్లో దండికోట
కన్నీటిని తొలగించిన పెన్నేటి పాట -

"జమ్ములమడుగు" లో నేడు
జలతరంగములు పాడెను
శిలలు కన్న కలలు లేచి
జీవనాట్యములు ఆడెను -

పేద రైతుల మొర విని
ప్రేమమయుడు వెంకటపతి
హరిహరుడై ఇచ్చినట్టి
వరము మైలవర మాయెను -

పెన్నేటిగట్లు రెండు
పెనవేసుకున్న చోట
సిరులే ఇరుకాలువలై
చీకట్లను వెలిగించెను -

శిథిలమైన కోటమీద
చెక్కబడిన చరిత్ర
రాయలసీమను చూచి
రాల్చెను రతనాలనవ్వు

# స్వర్గమంటే

స్వర్గమంటే
తెలుగులో ఏమనాలి?
తెనాలి
ప్యారిస్ అంటే తెలుగులో ఏమనాలి?
తెనాలి -

శిరము కాల్చే తేనెతలపులు
ఉరము చీల్చే విరహబాధలు
తీర్చగలిగే మందు ఎక్కడ కొనాలి?
తెనాలి -

కొంటెనవ్వుల పంటమీద
కొసరికొసరి వాలు పక్షుల
మత్తుగొలిపే పాట లెక్కడ వినాలి?
తెనాలి -

కచకుచమ్ముల కటితటమ్ముల
ఎత్తులకు పైఎత్తు లెత్తే
కామకేళీ కళలు ఎక్కడ కనాలి?
తెనాలి -

రసికతను యువలసితమును
వలపులను నవయౌవనమును
రంగరించిన లేహ్య మెక్కడ తినాలి?
తెనాలి!

# చదువన్నది ఒకరిసొత్తు

చదువన్నది ఒకరి సొత్తు కాదురా!
చదువుకుంటె తెలియనిది లేదురా!

హక్కు లెట్లు కలుగుతాయొ
చిక్కులెట్లు తొలుగుతాయొ
నేర్పుతుందిరా నీకు అక్షర జ్యోతి
"అందరికీ చదువు" అనే సమతా గీతి -

బాలుడైనా బాలికైనా
యువతియైనా యువకుడైనా
అమ్మైనా అమ్మమ్మైనా
తండ్రైనా తాతైనా
చదువుకొని బాగుపడే సదవకాశమున్నది
విద్యలన్ని నేర్చుకొనే వీలెంతో ఉన్నది -

రైతన్నకు కూలన్నకు
నీడలేని నిరుపేదకు
కలిమి బలిమి సమకూర్చే
వరము వయోజనవిద్య
చదువుకోనివాళ్లకేమొ
బ్రతుకంతా మిథ్య.

# నమ్మకం

నమ్మకము లేనట్టిదల్లా
నాశనమ్మోరా!
నమ్మువారికి మట్టిలోకమె
నాకమౌగదరా!

కొమ్మ కొమ్మకు ఎగురు కోతిని
నమ్ముకొని శ్రీరాముడే
సీత చెర విడిపించలేదా
రావణుని వధియించలేదా?

నమ్ముకొని ఒక నల్లనయ్యను
వాడు నూర్గురు కౌరవులనూ
మగువ ద్రౌపది గెలువలేదా
మాన రక్షణ పొందలేదా?

అందు ఇందు ఎందులోనూ
హరియె కలడని నమ్మినట్టి
భక్త ప్రహ్లాదుండు రాక్షస
శక్తులన్నీ జయించలేదా
రాతి స్తంభమునుండి, లోక
రక్షకుని రప్పించలేదా?

ప్రజాశక్తిని నమ్మి గాంధి
ప్రబల సామ్రాజ్యాధిపతుల
పరాజితులను చేయలేదా
స్వరాజ్యము సాధించలేదా?

# చెట్టు చెట్టుకు చెవి

చెట్టు చెట్టుకు చెవిపెట్టి వినుమా!
రాయి రాయిని కాస్త తట్టి వినుమా!
రామనామస్మరణ
రాగమే వినిపించు -

పక్షులూ పూవులూ
పవనాలు సెలయేళ్లు
భక్తితో శ్రీరామ భక్తినే కీర్తించు
శక్తితో శ్రీరామ భక్తియై నర్తించు -

అడవియే గొంతెత్తి
కొండలే తలలెత్తి
అయోధ్యరామ నామామృతము కురిపించు
మూగ మృగములుకూడ మురిపాన పులకించు -

ఆసేతు శీతనగ మానంద రామమై
భావి భారత చరిత శ్రీరామ ధామమై
వెలుగొందు స్వప్నాలె వెలుగొందును
అణువణువులో
చరాచర సృష్టిలో -

# శ్రీ శేషశాయి సాయి

శ్రీ శేషశాయి సాయీ! శ్రీ సత్యసాయి సాయీ!
ప్రేమావతార సాయీ! భవభయ విదూర సాయీ!

శ్రీ పుట్టపర్తీశ్వరా! శ్రీచక్రవర్తీశ్వరా
ఇహపరానంద బృందా దేహాత్మసుమ మరందా!
కాంతి ప్రశాంతినిలయా! కరుణాసముద్ర హృదయా!
సర్వజన హితబోధకా! సర్వసమ్మత సాధకా!

సత్యం శివం సుందరం నీదు త్రికరణ మందిరం
చిద్గోచర మగోచరం నీ ప్రణవతత్త్వ శిఖరం
కాషాయవసనధారీ నీలాకాశ వనవిహారీ!
ఆనందబ్రహ్మ తేజా అద్వైత సత్యభూజా!

విద్య వైద్యారోగ్య కల్పవృక్ష ప్రదాత
భక్తజన బాధా విముక్త శక్తి ప్రదాత
దేశకాలాతీత సుఖజీవన విధాత
శ్రీ సత్యసాయిబాబా కలియుగ విజేత !

నీ జన్మదిన మహోత్సవ శోభ తిలకించి
నరులు, కిన్నెరులు, సురవరులు పులకించేరు
విరులు, ముత్తెపుసరులు, అనురాగరసఝరులు
శిరముపై ఉరముపై నీ అభయకరముపై
చిరునవ్వులొలుకు నిను చేరి కురిపించేరు
జయజయన్మంగళ జయనాదములతో
సుందర శివ సత్య ప్రేమాభినయముతో

# రాము డాతడే

రాము డాతడే శ్యాము డాతడే
సత్యతారకాత్మ గగన సోము డాతడే
పరంధాము డాతడే!

బాలు డాతడే ప్రజ్ఞాలు డాతడే
పుట్టపర్తి పుణ్య క్షేత్ర పాలు డాతడే
గోపాలు డాతడే !

ధ్యాన మాతడే విజ్ఞాన మాతడే
సకలయోగ శాస్త్రసార గాన మాతడే
ప్రజ్ఞానమాతడే!
రథము అతడే పథము ఆతడే
సర్వధర్మ దర్శనాభిమతము ఆతడే
సూనృతము ఆతడే!

సత్య మాతడే నిత్య మాతడే
మనుజ జీవయాత్రకు
సాహిత్య మాతడే
సాహిత్య మాతడే !

గతము ఆతడే ఆగతము ఆతడే
వర్తమాన విశ్వశాంతి వ్రతము ఆతడే
శాశ్వతము ఆతడే
సత్యసాయి నామాంకిత
స్వామి యాతడే

# మందిర్‌లోనూ మస్జిద్‌లోనూ

మందిర్‌లోనూ మస్జిద్‌లోనూ
ఉండే దేవుడు ఒకడేరా!
మనుషుల్లోనూ మ్రాకుల్లోనూ
గుండెల్లోనూ బండల్లోనూ
ఉండే దైవము ఒకడేరా!

మందిర్ కూల్చి మసీదు కడితే
మసీదు కూల్చి మందిర్ కడితే
కూల్చేవారు కట్టేవారు
కొల్చే దేవుడు ఒకడేరా

రాముడు బుద్ధుడు క్రీస్తు మహమ్మదు
పుట్టకపూర్వము పుట్టెను మనిషి
మనిషికి దేవుని మహిమల కూర్చే
మతం ఒక్కటే మార్గ మొక్కటే
సృష్టికి మూలసత్య మొక్కటే !

పుట్టినవారి తీరొకటేరా గిట్టినవారి దారొకటేరా
మతమేదైనా హితమేదైనా మానవజాతికి జీవంపోసే
సూర్యు డొక్కడే చంద్రు డొక్కడే

అయోధ్యలోన పుట్టిన రాముడు
ఆదర్శముగా మెట్టిన రాముడు
ప్రేమకు మమతకు పెన్నిధి రాముడు
అణువు అణువులో అందరి మదిలో
కోవెల కట్టుక కొలువున్నాడు

# చదువుకో, చదువుకో!

చదువుకో, చదువుకో!
సంకటాలు తీర్చుకో!
కళ్లున్నా చూడలేని
వాస్తవాలు తెలుసుకో!

చదువుంటే కండబలం
చదువుంటే గుండెబలం
చదువుంటే బుద్ధిబలం
చదువుంటే చీకట్లను ఎదిరించే మహాబలం -

చదువు టెక్కడో కాదు
ఇక్కడే మొదలుపెట్టు
అప్పుడెప్పుడో కాదు
ఇప్పుడే కలంపట్టు
అక్షరాల సాక్షిగా అజ్ఞానం మట్టుపెట్టు -

ప్రశ్నవేయగల్గుటకు
ప్రత్యుత్తర మిచ్చుటకు
మంచిని గెలిపించుటకు
చెడుపును ఓడించుటకు
శక్తియుక్తు లిచ్చేది
చదువే చదువే చదువే
దురాచారములు మాన్పే
మార్గము చదువే చదువే!

# నీ హాసం మధుమాసం

నీ హాసం మధుమాసం అనుకున్నాను
నా బ్రతుకును నీ పాటగా మలిచేశాను

మేడలన్ని వదలి నీ
నీడ చేరుకున్నాను
నిఖిల దేవతల కాదని
నిన్నే నమ్ముకున్నాను
ప్రేమించా వనుకొని నిను పూజించాను
నా స్వప్నం నా సత్యం నీవని భావించాను

మౌనంతో నాకు ప్రణయ
మంత్రం నేర్పావు
బాస లెన్నో చేసి నన్ను
మోసం చేశావు

నా ప్రేమచషకంలో
గరళం పోశావు
నిను ఊపిన నా ఊపిరులను ఉరితీశావు

నిను సేవించే చేతులు
నరికేశావు
నిను కీర్తించే కోకిల
గొంతు పిసికివేశావు
నా తప్పేదో చెప్పక
మరణశిక్ష వేశావు

# బాబా పుట్టినరోజు

బాబా పుట్టినరోజు భగవానుడు పుట్టినరోజు
బాబా మెట్టినభూమి ప్రేమ సుధా రసభూమి -

బ్రతుకున కర్థం చెప్పెను బాబా
బాధల కంతము చూపెను బాబా
కులమత భేదము కూల్చెను బాబా
సమతా ధర్మము చాటెను బాబా

పుట్టపర్తిలో పుట్టిన సత్యం పుడమికి శివమై ప్రాకిన సత్యం
నిత్యానందక సుందరదీపం
సత్యసాయిబాబా వరరూపం

మనసుకు పట్టిన మాయ చీకటుల
చెదరగొట్టగల శక్తియె బాబా
అక్షర ధ్యానం ఆత్మజ్ఞానం అపశ్రుతిలేని జీవనగానం
ఉపదేశించే ప్రభువే బాబా

కష్టసుఖాలు కలిసి పంచుకొని - త్వమేవాహముగ భావించుకొని
జనులందరు జీవించినప్పుడు
జగమే స్వర్గముగా మారునని
సత్యసాయి బోధించిన తత్వం - ఇహపర సుఖకర సమతాద్వైతం

మనిషి మనిషిని ప్రేమించాలని - మట్టిని చెట్టును ప్రేమించాలని
జగతికి ప్రగతికి జీవంపోసే - చరాచరాలను ప్రేమించాలని
స్వార్థం, మోసం, లోభం లేని - సత్యమార్గమున పయనించాలని
సత్యసాయి భగవానుడు చాటిన - ప్రేమాగమ శ్రేయోజయనాదం
దేవుని దీవెనగా నిలవాలి!

# సత్యసుందర శబ్ద

సత్యసుందర శబ్ద శైల శిఖరాలపై
శివతాండవ మ్మాడినాడు
అతడు నవనాదములు పాడినాడు -

సాహిత్యవీణా సరస్వతీపుత్రుడై
సంగీతగానగంగాఝురీగాత్రుడై
వేద విజ్ఞాన ప్రజ్ఞాన రస నేత్రుడై
విలసిల్లె పుట్టపర్తి
నారాయణాచార్యుడై -

నరజీవనానంద నారాయణాత్ముడు
నాదబ్రహ్మోపాసనాచార్యు డతడు
సమదర్శి పుట్టపర్తి
సత్యసాహిత్యమూర్తి -

తెలుగుతల్లిని పిలిచి, భారతాంబను కొలిచి
లోకమాతను భక్తితో ఆత్మలో తలచి
తరియించిన కళాప్రపూర్ణుడు
పురస్కార పద్మపీఠాసీనుడు

తత్వమై నిత్యమై మృత్యుంజయత్వమై,
సాగిపోయెడి మానవత్వమై సత్యమై
రూపించె పుట్టపర్తి
దీపించె అతని కీర్తి !

# శ్రీశైల భ్రమరాంబికా

శ్రీశైల భ్రమరాంబికా
రక్షించు
నీ శక్తి బెబ్బులి నిక -

నల్లమల కొండల నడిబొడ్డుపై నిలిచి
తరగెత్తు కృష్ణను ఉత్తర వాహినిగా మలచి
రాజీవు గాంధి పులి రక్షా పథకముతో.....

పెద్దపులి రక్షణమె వన్యమృగ రక్షము
వన్యమృగ రక్షణమె వన్యజన రక్షణము
వన్యజన రక్షణే వనరక్షణము గదా!
వనరక్షే జీవ్యావరణ రక్షణ కదా!
జీవ్యావరణ రక్షే
జగతి రక్షణ పదా!

మౌర్యచక్రవర్తి, జైన మతము చేకొన్నట్టి
నాగార్జునుడు బౌద్ధమున సిద్ధిగన్నట్టి
పుణ్య క్షేత్రము ఇచట
పులిశక్తిని పెంచుమా
భారతప్రజల సౌభాగ్యమ్ము పెంచుమా!

# జై జవాన్

జై జవాన్ జై కిసాన్
శ్రమశక్తే భగవాన్
ఫ్యాక్టరీల పంటచేల
భరతమాత భాగ్యవాన్ -

నాగేటి చాలులో వడిచేటి రైతువెంట
కాలమే కదలివచ్చె పచ్చని విప్లవము తెచ్చె
బీడుభూమిలో మ్రోగె
ఏటి వీటిగంటలు
బక్క రైతు బ్రతుకుల్లో
పండె సిరులపంటలు -

దున్నేవాడిది భూమి
దోపిడీది మరుభూమి
కష్టించేవాడె స్వామి
కర్మభూమె పుణ్యభూమి

కొండల్లో శిలలు లేచి 'కోకో' అంటున్నవి
మట్టిలోన మరకతాలు ఉట్టిపడుతు వింటున్నవి
ప్రతి భారత పౌరుడూ ఒక లాల్‌బహదూర్
ప్రతి భారత నారీ
ఒక ఝాన్సీరాణీ -

# దేశమే దేవాలయం

దేశమే దేవాలయం
విద్యయే దైవం
దేశవిద్యల పూజలోన
దీపికలు మేము

తల్లి తండ్రుల గురువరేణ్యుల
చల్లచల్లని దీవెనలతో
శ్రద్ధగా చదువుకుంటాము
బుద్ధిగా మసలుకుంటాము

పెక్కు పేరులు పెట్టుకున్నా
పెక్కు దారులు వేసుకున్నా
ఒక్కడే భగవంతుడు
ఒక్కటై మేమంత అతనికి
మ్రొక్కుతుంటాము

మతములన్నీ భాషలన్నీ
మనిషికి దేవునికి మధ్య
వంతెనలుగా పరిగణిస్తూ
నిత్యజీవన సత్యగీతం
పాడుకుంటాము

# పల్లెల్లో పేదరికం

పల్లెల్లో పేదరికం
ఇల్లు కట్టుకున్నది
శ్రమజీవుల బ్రతుకుల్లో
చిచ్చు పెడుతున్నది -

ప్రణాళికలు పథకాలు
ప్రగతి విజయవ్యూహాలు
ఎన్నిటినైనా సరే ఎదిరిస్తూ ఉన్నది -

స్వార్థంతో చేయికలిపి
మోసంతో మైత్రిచేసి
ద్రోహంతో భుజంకలిపి
దోపిడి చేస్తున్నది -

జడత్వాన్ని నింపుతూ
జవసత్వం చంపుతూ
వికటకపటీ విధి' మీద
విశ్వాసం పెంచుతోంది -

బ్రతుకలేని నిరామయులు
చితికిపోవు అమాయకులు
మార్పురథం ఎక్కకుండ
మాయలెన్నో చేస్తోంది -

# పైనమబ్బులు

పైన మబ్బులు క్రింద మబ్బులు
మధ్యలోన విమానము
అందులో నా ఎడద చేసెను
అమితోహల యానము!

నాటి గంధర్వులకు గాని
నారదాదుల కైనగావి
లేని విభవము తెచ్చె నేటి
మానవుని విజ్ఞానము -

ముందుచీకటి వెనుక చీకటి
మధ్యలోనో మాయ వెలుతురు
చీకటుల పంజరములోన
వెలుగు పులుగు గానము!

కర్త కర్మ క్రియా సమైక్య
తురీయ చేతన యోగము
సృష్టినీ సృష్టినీ కలిపే
శూన్య నీరవ రాగము.

# అల్లా చెప్పినదల్లా

అల్లా చెప్పినదల్లా ఒకటే
అందరి సంక్షేమం
సంక్షేమానికి సాధన మొకటే
పరిమిత సంతానం -

తల్లిదండ్రులు కనే పిల్లలు
చల్లగ బ్రతకాలి
చల్లని పిల్లలకన్నుల ఆశల
దివ్వెలు వెలుగాలి!

పుట్టినవారి సుఖంకోసమే
పుట్టెను విజ్ఞానం
కష్టాలకు గురి అయ్యేవారిని
కనుటే అజ్ఞానం -

ఈతిబాధలు చీకుచింతలు
ఏ గొడవలు లేని
జాతిని నిర్మించే చేతన, మన
చేతుల్లో ఉంది

ఏ గుడిలో ఏ దేవుణ్ణైనా
అడుగుము ఒకే వరం
ఇహ పర సుఖములు ఇచ్చే
ఇరువురు సంతానం -

# ప్రేమ ప్రేమను ప్రేమించి

ప్రేమ ప్రేమను ప్రేమించి
పెళ్లి చేసుకుంటూంది
నియంత్రణం చేర్చిన ఇల్లు
నిండు సుఖం పండిస్తూంది -

కులం ఏమిటీ? అంటే
ప్రేమి కులం అంటారు
మతం ఏమిటీ అంటే
సమ్మతం అంటారు

గౌరివంటి కూతురు ఒకరు
శౌరివంటి కొడుకు ఒక్కరు
ద్వైతాద్వైతానందాల
గీతాలాపన చేసేరు

కాలానికి రూపం ఒకరై
దేశానికి దీపం ఒకరై
ఇంటింటా వెలుగుతూ ఉంటే
ఈ లోకం స్వర్గం కాదా?
ప్రతి జంటకు ప్రణాళికుంటే
బ్రతుకు శాంతిదుర్గం కాదా?

# పల్లెసీమలు పల్లవిగా

పల్లెసీమలు పల్లవిగా పాటలల్లాలి!
ఎల్లప్రజలు చల్లగ బ్రతికే బాట వేయాలి!

పేదవారిని పెంపుచేసే యుక్తి మనకుంది
దేశ ప్రజలకు కలిమికూర్చే శక్తి మనకుంది
సర్వ సమతాధర్మవిజయం తథ్యమౌతుంది

సమగ్ర గ్రామీణాభివృద్ధి సాధ్యమౌతుంది
హరిజనులకు, గిరిజనులకు అట్టడుగువర్గాలవారికి
సిరులు పంచే విరులకారు తరలివస్తూంది!

లెక్కలేని పక్కాఇండ్లు
పల్లెపల్లెలను కలుపురోడ్లు
అందరికి ఆరోగ్యమిచ్చే వందలాది ఆసుపత్రులు
చెరువుకుంటలు పాఠశాలలు త్వరితగతిలో వెలుస్తున్నవి
యువకులకు జీవనోపాధులు కల్పిస్తూన్నవి

అందరికి విజ్ఞానమిచ్చే అక్షరాస్యతజ్యోతులు
ఆర్థికస్తోమతను పెంచే పొదుపులక్ష్మి పిలుపులు
అపరిమితమౌ సుఖములిచ్చే మితకుటుంబవ్యవస్థలు
చిన్నతరహా పరిశ్రమలు, చేతికందే బ్యాంకులు
వృత్తివిద్యా శిక్షణలు, మద్యపాన నిషేధాలు
పట్టణాలకన్న మిన్నగ
పల్లెలను మార్చేస్తున్నవి
జాతిపిత కన్నట్టి కలలు నిజం చేస్తున్నవి

# దేవా! కనలేవా?

దేవా! కనలేవా? ఈ
దేశ మెలా ఉన్నదో
సంక్షేమ స్వరూపుడవై
పరిచేయగ రావా! -

ఈతిబాధలెన్నో మా
జాతిని పీడిస్తున్నవి
అనారోగ్య నిరుద్యోగ
జనాభాల వివాదాలు
నిప్పులు కురిపిస్తున్నవి

చదువుకుంటె లేనిపోని సంకటాలు లేవని
రాత నేర్చుకుంటే, తలరాత మారిపోవునని
చదువురాని వయోజనులకు
శక్తిలేని పౌరులకు
ఎరిగించగలేవా?

కుతంత్రాల కులతత్వం
మారణాల మతకలహం
అరాచకపు అలజడులు
దురాచార దుర్బోధలు
వారించే శంఖారావము నీవై రావా?
నవజీవన విప్లవ గానము నీవై రావా?

# శ్రీ సామ్యుల్ హనేమన్

శ్రీ సామ్యుల్ హనేమన్! జోహారులు నీకు
హోమియోపతి పితా! ప్రేమాంజలి నీకు . . .

విజ్ఞాన తపస్వివి, విశ్వ విశాల యశస్వివి
ఆయురారోగ్యాల అశ్వినివి నీవు
నవవైద్య నారాయణ అవతారము నీవు
ఇంటికి ఇంటింటికి శ్రీకారము నీవు . . .
జర్మనీలో నీవు జన్మించావు జగమెల్ల ప్రేమించి జీవించావు
దేశకాలాతీత సంజీవన సత్యాలు
శోధించి, సాధించి, బోధించావు . . .

సులభమౌ, సుభగమౌ, సత్వరమౌ, చౌకయౌ
రోగ నివారణ విధాన యోగము నీది
భద్రత గల చికిత్సా ప్రయోగం నీది
బాధ్యతగల సూక్ష్మబుద్ధి వైద్యం నీది . . .
గరళమైన నీవె మ్రింగి కష్టాలెన్నో సహించి
ప్రకృతిసిద్ధమైన వైద్యపద్ధతి కనిపెట్టినావు
శివంకరుడవైన రుజాసురాంతకుడవైనావు
సతి మేరీ మెలనీయుత ధన్వంతరి వైనావు

నీ జన్మదినం పవిత్ర పర్వదినం మాకు
నీ సంస్మరణం పూర్ణారోగ్యధనం మాకు . . .
తేలుకాటు, పాముకాటు, కుక్కకాటువంటి
విషపాతమునకు బలియౌ వేవేల అమాయకులను
రక్షించే ప్రాణదాన ఔషధాలు చేసి
పల్లెపల్లెలో ఉచితముగా పంచే ధర్మాత్ములు
'అశ్వినీ హోమియో' అధిపతులకు నేడు
ఆదర్శము, ఆధారము, ఆరాధ్యుడు నీవే

# సాయిభక్తులం

సాయిభక్తులం, సత్యసాయిభక్తులం
సాయి సత్యమార్గంలో సాగు భక్తులం -

కర్మయోగులం, సత్య ధర్మయోగులం
జ్ఞానయోగులం, ఆత్మ జ్ఞానయోగులం,
స్వామిభక్తియోగులం ప్రేమశక్తియోగులం -

సాయిసూక్తులే మాకు శరణం శరణం,
సత్యసాయి బోధలే సకల బాధాహరణం
శాంతి కిరణావరణం -

బాబా భావనలు భగవాను దీవెనలు
బాబా చిరునవ్వులు
వాడిపోని పువ్వులు
దారిచూపు దివ్వెలు -

సాయిస్వామి ఉపదేశం
సత్యవాణి సందేశం
పరిశుద్ధుని సహవాసం
వెలిగించును జగతినిండ
పావన జీవనహాసం
ప్రగతి సుగతి ప్రత్యూషం -

# ఎక్కడో ఆకాశవీధి

ఎక్కడో ఆకాశవీధుల
ఎగసిపోయే నన్ను పట్టి
కుటిల సంకుచిత దుర్భర
కూపమున పడద్రోసినారా?

తోటనే ఒక పాట చేసి
పాటనే విరిబాట చేసి
నింగినేలల కలుపు నా కృషి
భంగపరచిన మూర్ఖులారా!
కన్ను పొడిచిన మాత్రమునవే
కాంతి యన్నది మాయగలదా! . . .

రంగులూ, రూపాలు మార్చే
దొంగచీకటి దొడ్డిదారుల
గుట్టు బయటపెట్టు నన్నే
పట్టుకొని శిక్షించినారా!
న్యాయమూర్తిని మోసగించిన
న్యాయదీపం ఆరగలదా!

మనిషిలో దైవమ్ము కలదని
మట్టిలో జీవమ్ము కలదని
సత్యప్రకటన చేయు నన్నే
హత్య చేయబూనినారా!
మార్గదర్శిని మట్టుపెట్టిన
మార్గమన్నది మారగలదా?

# అతి సర్వత్ర వర్జయేత్

అతి సర్వత్ర వర్జయేత్
ఆనంద మాత్రం
మితకుటుంబ సమతా జీవనమే
సౌభాగ్య ఛత్రం -

ప్రకృతిని పరిశీలించి నేర్చుకో
పరిమితి తత్వం
విగ్రహమును పాటించి తెలిసికో
నీ జీవిత సత్యం

చావు పుట్టుకలు రెండూకూడా
సహజధర్మమే
ఆ రెంటినీ విరోధించుట
పరమధర్మమే -

కోకిలవలె రాగిల్లేనా
కాకులదండు
రత్నమువలె రాణించేనా
రాళ్లని మెండు

# మూసీనది గొంతుతడి

మూసీనది గొంతుతడి ఆరిందీ
పాటలు పాడిన ముద్దుల ఏటిలో
మౌన వేదనం వచ్చి చేరిందీ -

వర్షమెంత కురిసినా వరదలెన్ని పారినా
కదలదు మెదలదు మూసీ
కాళ్లు తెగిన పక్షిలా
కటిక చీకటిలా -

గోలకొండ గుండెపికము గొంతెత్తిన పిలుపు
కులమతాల కతీతమౌ
కులీకుతుబుషా వలపు
భాగ్‌మతీ కౌగిటిలో భావిసౌధమును కట్టెను
చరిత్రేమొ దానిపేరు
చార్మినారు అని పెట్టెను -

గండిపేట అడ్డుకుంది
మూసీ గత వైభవం
కలతచెందినట్టి మూసి
కనులుమూసి మూల్గుతూంది
మురికి సంస్కృతిని రోసి ముక్కుమూసుకుంది -

భిన్న సంస్కృతులను కలిపి
మిన్నంటిన మూసీ
కలలెన్నో నిజాలుగా వెలిగించిన మూసీ
చితుకుతున్నదిపుడు
కాంతిలేని కనులు మూసి!

# అక్కయ్య - అన్నయ్య

అక్కయ్య అన్నయ్య ఎక్కడ ఉన్నా
బాలానందం వారికి అన్నిట మిన్నా -

బాల బాలికలు వారికి భాషలు భావాలు
బాల బాలికలె వారికి పూలు పరిమళాలు
బాల బాలికలె వారికి కలలూ నిజాలూ

నీతికథలు జాతికథలు నిండుగుండెతో చెప్పి
చెప్పి చెప్పి కథలెన్నో చిన్నారులందరికీ
వారిబ్రతుకె అయిపోయెను
వాస్తవ ఆదర్శకథ

నడక నేర్చు పసికందుకు నర్తన నేర్పి
పలుక నేర్చు పాపాయికి పాటలు నేర్పి
మురిసిపోవు అక్కయ్య మోముకు జేజేలు
మెరిసిపోవు అన్నయ్య మనసుకు జేజేలు -

పిల్లల నాటకములతో పెద్దలకే బుద్ధినేర్పి
బాల కళాకారులతో భారతికే గద్దెవేసి
కామేశ్వరి అక్కయ్య  రాఘవరావన్నయ్య
అపరసాంబశివులైరి ఆనందభవులైరి -

సంఘం బాలానందం ధర్మం బాలానందం
బుద్ధం బాలానందం శరణం బాలానందం
అక్కయ్యకు అన్నయ్యకు డెందం బాలానందం
ఆంధ్ర బాలానంద సంఘమె శరణానందం

జైజై బాలానందం జై విజ్ఞానమరందం
జైజై మమతాబంధం జై సమతాగంధం
జై బాలానంద సంఘ స్థాపక సందీపకులకు
స్వర్ణోత్సవ జయ హారతి సంస్కృతీ వ్యాపకులకు . . .

# పరిపూర్ణ మానవుడు

పరిపూర్ణ మానవుడే
పరమేశ్వరుడు
శివకేశవుడు -

కనిపించే రూపము కాదు దేవుడు
నడిపించే శక్తియే నారాయణుడు
భావించే భక్తియే భగవానుడు
బాబాయే భక్తిశక్తి
బాబాయే బంధముక్తి -

తనువు లేనివాడే
మన తనువులోనివాడు
పేరు లేనివాడే
ప్రతి పేరులోనివాడు
పేరులేని ఊరులేని ప్రేమే మన పెన్నిధి
పూవులేని తావిలేని పూజ దైవసన్నిధి
మన పెన్నిధి మన సన్నిధి
మహా సత్య సాయియే -

మంచిని ప్రేమించువాడు
మానవతను పెంచువాడు
మాయలకు లోబడని
మహిమను సేవించువాడు
స్వార్థానికి చిక్కని పర
మార్థము సాధించువాడు
వాడు వీడు ఏవాడూ
నరుడైనా హరుడే . . .

# పిల్లలకు పాలిచ్చే తల్లులు

పిల్లలకు పాలిచ్చే
తల్లులకే
దేవుని దీవెనలన్నీ
చెల్లునులే!

అమ్మపాల మించినట్టి
అమృతం లేదు
పదేపదే కను అమ్మకు
పాలే లేవు,
చూలిని తన ఎదచేర్చే సుకృతం లేదు

స్త్రీ సంక్షేమం ఉంటే
శిశు సంక్షేమం
శిశు సంక్షేమంలోనే
జీవనరాగం
జీవనరాగంలోనే దేవుని గానం

ఆరోగ్యం కలిగినట్టి
ఆలుబిడ్డలు
కలకలలాడే ఇల్లే
కోవెలరా
ఆత్మీయత అమరాగమె
దైవమురా!

# పాతికేళ్లు

పాతికేళ్లుకూడ లేని
పసివాళ్లకు
పెళ్లిచేసి వారిబ్రతుకు
దుల్ల చేయకు!

పట్టిపట్టి మూడుముళ్లు
కట్టుటేలరా?
దారిలేని అడవిలోకి
నెట్టుటేలరా?
తెలిసి తప్పుచేసి, విధివి తిట్టుటేలరా?

సంసారానికి లక్ష్యం
సంతోషంరా!
సంతాపమె అనుకుంటే
సంతాపమురా!
దాంపత్యము రసానంద దైవత్వంరా!

యుక్తవయసు రాని పెళ్లి
రక్తి గట్టునా?
రెక్కలు రాని పక్షులు
ఎగర గలుగునా?
గాలిలోన దీపము వెలుగ గలుగునా?

ఈడుజోడు గల జంట
ఇద్దరు చాలంటుంది
పరవశాన పాడిందే
భక్తి గీతమంటుంది

# పల్లెసీమల ప్రగతిబాట

పల్లెసీమల ప్రగతిబాట వేసే చెల్లీ!
కాలమే నీవెంట కదలివచ్చేను
పంచాయతీరాజ్ పాట పాడే తల్లీ!
దేశమే నీ కంటిదీపమై వెలిగేను . . .
అబలవనుకున్న నీ ప్రబలశక్తిని చూచి
పల్లెపట్టుల ఎదలు పల్లవించేను
మధుమాస కోకిలము మార్పుగీతము పాడ
నవయుగలతాంతాలు నాట్యమాడేను . . .
మనిషిపుట్టుకలోని మర్మమెరిగిన తల్లీ!
కన్నబిడ్డల సుఖము కాంక్షించు తల్లీ!
జగతికంటకమౌ జనాభాను అదుపులో
పెట్టు బాధ్యతను చేపట్టవలెనమ్మా! . . .
ప్రజల ప్రతినిధివియై బయలుదేరావంటె
పరిసరాలన్నింట పారిశుధ్యము వెలుగు
వీధి వీధిన వెలుగు విద్యుత్తు దీపాలు
ఊరూర సమకూరు ఉపాధి అవకాశాలు . . .
గ్రామలక్ష్మివి నీవె గృహలక్ష్మి నీవె
పాడుపులక్ష్మివి నీవె భూలక్ష్మి నీవె
ఆరోగ్యలక్ష్మి విద్యాలక్ష్మి నీవె
సకల సౌభాగ్య సమతాలక్ష్మి నీవె
ఆత్మవిశ్వాస దీక్షాదక్షురాలవై
స్త్రీశక్తిని మించిన దేశక్తి లేదని
దేశమంతట చాటవే విజయవల్లీ!
ఇంటింట తరగలెత్తే పాలవెల్లీ !

# డెబ్బది వాసంతాల పబ్బం

డెబ్బది వాసంతాల... పబ్బమిది
పుట్టపర్తి చేసుకున్న ... పుణ్యమిది

వేదాలు సత్యధర్మ వాదాలు కలిసిమెలసి
ప్రశాంత నిలయము నుండి
ప్రపంచాన్ని పాలించే
ప్రేమవిజయపర్వ మిది
సత్యసాయి వ్రత మిది

చిరునవ్వుల దివ్వెలతో చీకట్లను తొలగించే
మౌనధ్యాన తైలంతో మమతలెన్నో వెలిగించే
బాధలను సుబోధలతో భస్మీపటలం చేసే
రాజహంస నడకలతో రసానంద మందించే
శాంతిదూత సాయి
జన్మసాఫల్యోత్సవ మిది

కరుణామయ త్రికరణాలు
సామభూతి సద్గుణాలు
సమతా దర్శనశక్తి, భావభౌతికస్ఫూర్తి
ప్రతిమనిషికి ప్రసాదించు ప్రభువు ప్రభవ దినోత్సవం
తేటతెనుగు మాటలతో పాలవెల్లి పాటలతో
మనిషికి దేవునికి ఒకే మాతృభాష బోధించే
సత్యసాయి మహోత్సవం.

# చెట్టు మీద

చెట్టుమీద రెండు పిట్ట లున్నాయి
చెట్టుకింద పాము పుట్ట లున్నాయి -

పిట్ట గుండెలు పెట్టె
ప్రేమతో గుసగుసలు
పాము పడగలు కొట్టె
పగబట్టి బుసబుసలు

గుసగుసలు పూవుల గుత్తులైపోయె
బుసబుసలు చీకటి బుట్టలైపోయె
విరులేమొ మమతల సిరులు పండించె
ఇరులేమొ ద్వేషాల ఝురులు పారించె

ప్రక్కనే పారేటి
పంట కాలువలో
పూలతావులు పొంగి
పారలిపోతాయో!
కాలనాగుల విషము
కలిసిపోతుందో !

# ఆపరేషను చేసుకుంటే

ఆపరేషను చేసుకుంటే
ఏ పరేషానీ లేదు
నిరోధులను వాడుకుంటే
మరే బ్రతుకు భయం లేదు -

నమ్మండి ఈ మాటలు ఓ యమ్మలారా!
నమ్మండి నా మాటలు ఓ అయ్యలారా!
"నమ్మిచెడినవారు లేరు
నమ్మక చెడిపోతారు"
అన్నారు పెద్దలు, ఎరిగి అన్ని విద్దెలు

అన్నమే దైవస్వరూపం
ఆకలికి కేక లిడువారికి
మనిషియే మాధవుని రూపము
మాయమర్మము లెరుగువారికి
సంతానము నిరోధించే
సాధనమె దైవమందరికి

ఏడు అడుగులు వేసినప్పుడు
ఏడుకొండలు ఎక్కునప్పుడు
మతము పేరిట మందిరాల్లో
హితము కోరి మ్రొక్కినప్పుడు
కుటుంబమె ధర్మవిధి యని
చేయవలెను ప్రమాణము

# మత్తుగా గమ్మత్తుగా

మత్తుగా గమ్మత్తుగా
కొత్తయేడు వస్తోందీ
చలిగాలికి గిలిగింతలు
పులకింతలు తెస్తోంది! -

తరతరాల చరిత్రను
తలనిండా ముడుచుకొని
యువకామన నవజీవన
రసనాట్యం చేస్తోంది -

గడియారపు రెండుముల్లు
పెనవేసుక ఒకటైనవి
నడిరాతిరి ఒడిలో
చుక్కల ఎద గుసగుస లైనవి
సత్య శివసుందర శుభాకాంక్ష మణులైనవి -

పూలు పళ్లు మిఠాయీలు
పులకించిన మనసులు
చరాచరము చిరాచిరము
పరవశించి పాడేను
దిశలన్నీ మైమరచి
నింగి కొసల ఆడేను -

# రాతిబొమ్మ వనుకొని

రాతిబొమ్మవనుకొని నీ
చేతిని వరికేశారా!
జడరూపము అనుకొని నిను
కడలిని పడవేశారా!

సూర్య చంద్ర కిరణాలే
నీ సుందర హస్తాలు
కాల సరసిలో విరిసిన
లీలా కమలాంబ నీవు
పరాశక్తి ప్రకృతి నీవు
హిమశైలాకృతివి నీవు -

ముక్కలైన నీరెక్క
లెక్కలేని చేతులయి
భక్తులైన ప్రతి ఒకరికి
ముక్తి మార్గమును చూపును
ఆపదమొక్కులవారికి
అభయహస్త మందించును -

నిత్యమైన సత్యానివి
నిగమ గోచరత్వానివి
దివ్య మానవత్వానివి
దేవీ! దైవత్వానివి
మము బ్రోచే మము కాచే
కనక మహాలక్ష్మీ!

# ఆరిపోని దివ్వెలు

ఆరిపోని దివ్వెలు
వాడిపోని పువ్వులు
ఉంటాయని ఋజువు చేయు
చిరు కవితలు చిర కవితలు

వేమన పద్యాలు వాటి
స్థిర విలాసము
శతకాలెన్నో వాటి
చిద్విలాసము

రత్నానికి రెక్కలొచ్చి
పగడానికి మాటలొచ్చి
అనుభూతి గగనంలో
దివ్యమనే రామచిలుక
అక్షరాల చిరు కవిత

కొండ ఎత్తు లోయ లోతు
కొంచెముగా బింబించే
అద్దము లాంటి కవిత
అందమైన మినీ కవిత
నాల్కమీద నాట్యమాడు
నవ్యభావరసగుళిక
చిరంజీవి చిరు కవిత

# గాలి వీధుల

గాలి వీధుల నడుగుతూంది
గానభిక్షం
బెండువోయిన గండుకోయిల
ప్రాణవృక్షం!

తోట నేర్పిన మాతృభాష
పాట ఏనా!
పాట నేర్పే మేటి తల్లి
పక్షియేనా!
పక్షిలేని పాటలేని తోటలో
గాలి శవమై తేలుతూంది
కాలఝురి కన్నీటిలో -

పక్షులన్నీ ఎగిసిపోయెను
పాటలన్నీ మూగవోయెను
పాటలేమో పక్షికోసం
ఎదురుచూచు
పక్షులేమొ పాటలేవని
బెదరి చూచు

పక్షులను పాటలను కలిపే
తోటమండి
రక్షణము లేదంచు తరువులు
ఒక్కటొకటిగ
వెడలిపోయెను

# వీధిలోన నీవే

వీధిలోన నీవే, విను
వీధిలోన నీవే!
ముజ్జగాలు పాలించే
ముక్తేశ్వరి నీవే!
తేజోమయపీఠి రాజ రాజేశ్వరి నీవే!

గుడిగుడిలో నీవే
గుండె గుండెలో నీవే!
మింటిలోన నీవే
ఇంటింటిలోన నీవే!
కనక మహాలక్ష్మి!
కల్యాణ వాణి నీవే! -

రథము నీవె పథము నీవె
బ్రతుకు గమ్య మీవే
శ్రీకార ఓంకార
చిద్రూపము నీవే!
కల వీవే నిజ మీవే
కలకాలము నీవే -

తప్పేదో ఒప్పేదో
చెప్పే శారద వీవే
కలిమేదో లేమేదో
తెలిపే లక్ష్మివి నీవే!
పాపపుణ్యముల ధర్మము
చూపు భవానివి నీవే! -

# సారాకే మరోపేరు

సారాకే మరోపేరు
సర్వనాశనం
త్రాగుడుపై నిషేధమే
ప్రగతి శాసనం -

సారా తాగిన వారు
సాధించిన దేమిటి?
ఆస్తిపాస్తు లమ్ముకొని
ఆరోగ్యం చెరచుకొని
అలమటించుటేగా!
మానాభిమానాలను
మంటగలుపుకొనుటేగా!

గుటికెడంత గతిగావో
గుర్తుండదు మంచిచెడు
సారా సీసా నుండి
సంసారసుఖం జారిపోవు
నిషావోలె మురిపించి
విషాదముగ మారిపోవు -

మత్తుగ తాగావంటే
మాయలోన పడతావు
మాయలోన పడినావో
మాట తప్పుతావు
మాట తప్పుతావు బ్రతుకు
బాట తప్పుతావు.

# నీ ఒడలు ఊగినది

నీ, ఒడలు ఊగినదిలే
నా, ఎడద ఊగినదిలే
నీ ఒడలి మీద నా ఎడద
ఊయలూగినదిలే -

కడలివోలె నీ ఒడలు
పడవ వోలె నా ఎడద
కలిసి ఊగినవిలే
నీ కంటి చూపు మింటిలో
నా కలల గాలి పాటలో -

తాడులేని ఊయలలో
తలపుల తన్మయతతో
తూర్పు పడమరలు కలిసి
తూగాడెను జతకూడెను -

కొండవాగులా నీవు
కులుకుచు పోతున్నట్లు
నాట్యమాడు నీ నడుము
నన్ను ఊపుతున్నట్లు
అనుభూతిని కలిగించిన
అద్దము నే ముద్దిడితిని
కలయో నిజమో తెలియక
కలవరపడి పోతిని

# నీ కనుల వెలుతురులో

నీ కనుల వెలుతురులో
నా కన్నులు తెరిచాను
కనులుతెరచి ఇది భూలోకమనే మరచాను

నీ పెదవులను నా పెదవులతో తరచాను
తరచీ తరచీ నన్ను నేనే మరచాను
మరలు పైతమూ కనని
స్వర్గమున నిలిచాను

నీ ఎరుపెక్కిన చెక్కిలిబిస నే నొక్కాను
ఒక్కమారుగా హిమగిరిశిఖరా లెక్కాను
గాలి ఈలలు వేస్తుంటే శివమెత్తాను
ప్రేమ పీమల జయించి జయంతిక లెత్తాను -

నింగి కొనలతో
నీ నడుమును నే చుట్టాను
నిదురబోని నా
కనులను మూసిపెట్టాను
కలలను మించిన వాస్తవాలు కనిపెట్టాను
విశ్వసుందరి కిరీటము నీకే పెట్టాను

# పాలు తేనె తెచ్చాము

పాలు తేనె తెచ్చాము
భక్తితో వచ్చాము
మాటలలో చెప్పరాని
మౌనముగొని తెచ్చాము -

నిన్ను నమ్ముకున్నాము
నిర్భయముగ ఉన్నాము
పెడదారిని పోకుండా
నడిపించుము తల్లీ!
సుఖ సంపద్వల్లీ! -

నిక్కమైన నీ మహిమలు
లెక్కకు మిక్కిలి మాతా!
మార్గశీర్షమే నీకు
మధుమాసము మాతా!

బురుజుపేట నీ పీఠము
హిమగిరి నీ కిరీటము
నిరుపేదలు నిర్భాగులు
నిఖిలలోక వాసులూ
నీకంటి పాపలు -

# తెల్లని వెన్నెల తెరపై

తెల్లని వెన్నెల తెరపై
అభినయ
చిత్రాలేనా జీవితాలు!
గాలి తాకిడికి గలగల రాలే
పత్రాలేనా జీవితాలు!

జీవితమన్నది కలయో నిజమో
చెప్పలేదు ఏ జీవితము
కలయే నిజమా నిజమే కలయా
తెలుపలేదు ఏ అనుభవము -

కలయే నిజమని అనుకుంటే
మరి నిజ మేమిటి యని భావించాలో
నిజమే నిజమని నమ్మితిమా
మరి కల ఎందుకు కనుపడినట్లో!

కలలో జీవించే కాలంలో
కనపడని నిజం కలయౌనో!
నిజాన్ని చూచే కాలంలో
కనుమరుగౌ కల అవి ఏమౌనో!

వాస్తవాలతో చరిత్ర వ్రాసే
నేస్తాలకు వోలె
కలల చరిత్రలు కూడా వ్రాసే
కాలవేదు లెవరో?
కలలు నిజాలను కలిపే కాలం
వెలిసే దెప్పటికో!

# నీ ఆపాదమస్తకం!

నీ ఆపాదమస్తకం
శృంగార కళా పుస్తకం
మరల మరల నే చదివాను
బోధపడక మతి కోల్పోయాను -

నీ వంపులలో కొంపలు తీసే
సొంపులు నింపావు
తోలుబొమ్మలా ఆడి నన్ను నీ
కీలుబొమ్మ చేశావు.

కటిక చీకటులు సిగలో ముడిచి
నీ కన్నులు వెలిగిస్తావు
ఒంటిమీది స్వర్గాలను దాచి
కొంటెనవ్వు పడవేస్తావు.

తడబడినట్లే అడుగులు వేస్తూ
నీ నడుమును సంధిస్తావు
కనపడనట్లు దిక్కులు చూస్తూ
కాలమునే బంధిస్తావు.

# సుఖ సంపద్ వర్ధినీ!

సుఖ సంపద్ వర్ధినీ
సుందర కపర్దినీ
కరుణా వీక్షణధునీ
కనక మహాలక్ష్మి!

ఆదిలక్ష్మి, ధాన్యలక్ష్మి
ధైర్యలక్ష్మి, గజలక్ష్మి
విజయలక్ష్మి, విద్యాలక్ష్మి
పరిమిత సంతానలక్ష్మి
అపరిమిత ధనలక్ష్మి
అష్టలక్ష్ములను కొలిచి
నట్లే, నిను కొలిచినపుడు-

ఏడు కొండ లెక్కలేని
ఏ గుడులకు చేరలేని
భక్తులు నిను 'అమ్మా!' అని
భజియించిన చాలు గదా
కోరుకున్న మ్రొక్కులన్ని
తీర్చెదవు ఓదార్చెదవు -

కుచేలులు నిను కొలచుచు
కుబేరు లౌతున్నారు
జానపదులు నిను తలచుచు
జ్ఞాన నిధులు అయ్యేరు
ఆబాల గోపాలము
అమ్మా అని నిను పిలుచుచు
ఆత్మానందంలో పర
మాత్మను దర్శించేరు -

# ప్రజలదే ఈదేశం

ప్రజలదే ఈ దేశం
పేదప్రజలదే భారతదేశం
ప్రజలదే మన ప్రభుత్వం
పేద ప్రజలదే నాయకత్వం -

ప్రజలేమొ యజమానులు
ప్రభుతేమొ ధర్మకర్త
పథకాల పథములన్నీ
ప్రణాళికల యాత్రలన్నీ
చీకటుల చిక్కుకున్న
జనకోటి సుఖముకొరకే!

కురిపేటి మబ్బులైనా
విరిపేటి మట్టియైనా
ప్రజల కోర్కెలు తీర్చేటి
పరమ సేవా మూర్తులే!

కష్టించు జనము నేడు
కనుపించు దేవుళ్లురా!
గర్జించు పరిశ్రమలు
కనికరించే గుళ్లురా!

శ్రమశక్తి పూరించెరా
శాంతి విప్లవ శంఖము
కలలన్ని పండించగా
కదలింది కాలచక్రం

# నా కన్నులు చెమ్మగిల్లె

నా కన్నులు చెమ్మగిల్లె
నీ కోవెలలో
నా కోరిక లీడేరెను
నీ సన్నిధిలో -

మోసి మోసికొని తెచ్చిన
మొక్కుబడుల మూట
మంచువోలె కరిగిపోయె
దించగానె నీ ముందట -

చదువులెన్ని చదువుకున్న
సమాధానములు దొరకని
ప్రశ్నలు ని న్నడగాలని
పట్టుబట్టి వస్తే
నిన్ను చూచి చూడగానే
అన్ని మరచి పోయాను -

తీరని తలపుల దాహం
దారసుతులపై మోహం
తీరిపోయె నా చిదాత్మ
తెలిసికొని పాడగానె
శ్రీరాగం దాసోహం

# పవిత్రమౌ మందిరాల

పవిత్రమౌ మందిరాల
పచ్చిబూతు బొమ్మలు
కాంచినపుడు బావా! నీ
కపి చేష్టలు గుర్తుకొచ్చు!

బావా అనికాదు, కామ
దేవా అని పలువాలని
మూరలతో కాదు నిను బారలతో కొలువాలని
ఆవేశపడేను నా అంతరాత్మ ప్రియుడా!

మాయ భోగముల చూసే
నామతి పోతుంటే
నీ నిజభోగంలో పడితే
నేను అసలు మిగిలేనా -

రంగుల మెరుగులకే నా
కనులు మూతపడుతుంటే
నీ మంగళ రూపము గని
నా పొంగులు నిలిచేనా!

రాతి బొమ్మలకు తెలియని
రమణీయ రహస్యాలు
ఈ నాతిబొమ్మ కనుగొను నీ ప్రేమానుభూతిలో
మధుర మౌన గీతిలో

# కలలుగనే నా హృదయం

కలలుగనే నా హృదయం
కన్నీరై పారుతూంది
నా వాస్తవ జీవితాన
లావాగ్ని రగులుతూంది -

నా విశాల దేశ వనం
నవ్వుల నందన మంటిని!
కాని నేడు విషం గ్రక్కు
నాగుల పుట్టగ కంటిని -

అంబరాల ముద్దిడు శీతాచల శిఖరాలను
సాగరాల కౌగిలించు సైకత తీరాలను
ఒక్కటిగా జతకూర్చిన
దృక్కులు ముక్కలౌతూంటె -

మాట్లాడుకొనే భాషలు
కొట్లాటకు దిగుతుంటే
దూరాలోచనలు మాని
దురాలోచనకు దిగితే
కులమతాల మానవత కొంప తగలబెడుతూంటే -

నేల పులకరించునట్లు గాలి పరిమళించునట్లు
సమతామమతలు విరిసే సౌభాగ్యోదయ మెపుడో
కలలు వాస్తవాలయ్యే కాలోదయ మెప్పుడో!

# నిస్తుల శక్తి

నిస్తుల శక్తి ప్రదీపుని
నీలాకాశ స్వరూపుని
సప్త గిరీశుని కనగానే
నా సుప్త చేతనము మేల్కొనెను -

శూన్యపు ఈశాన్యంలో
పాలపుంత సంద్రంలో
కుండలీకృత ఫణి పానుపుపై
పవళించిన పరమాత్మను చూచి
పరవశించి పోయాను!

చరిత్రకందని కాలంకట్టిన
శిలాతోరణము క్రింద
మట్టికి చెట్టుకు ప్రాణంపోసిన
మహారణ్య మౌనంలో
యోగ ప్రయోగ ముద్రితమైన
నా నయనాలె నవ ప్రదీప్త
భానుగోళములుగా మారె!

వెలుగు లేని నాదేహములోనె
విద్యుత్తులుగా వెలిగె
రూపు లేని నా ఆత్మాలయమున
రూపురేఖలై వెలిసె
గోపుర ప్రకారాలు, శ్రీనివాస శ్రీకారాలు

# పుస్తకాలలో

పుస్తకాలలో నేర్చుకున్న
నా ప్రస్థానత్రయ పాండిత్యం
చెదరి పోయినది నీ గంభీర
నతనాభి సీమ చేరగనే !

ప్రకృతి తత్త్వములు శోధించిన
నా సకల శాస్త్ర విజ్ఞానం
నీ శిరోజ నీలోన్నతి ముందు
నిలిచి తెల్లబోయినది -

దిక్కు తెలియని దిగంబరులమై
చిక్కుకొంటిమా ప్రాణసఖీ!
ఆదిమ ద్విశరీరాలింగనమున
నాదవినోద విచిత్ర బంధమున -

ఇహపర భావాతీత జలధిలో
మన నగ్నాత్మలు తేలినవి
కొటారు కొమ్మన కూరుచున్న మన
కోకల దొంగను చూచినవి
ఆనందాల వలువ లిమ్మని
అహమును వీడి అడిగినవి!

# క్రూర కుతంత్ర హస్తం

క్రూర కుతంత్ర హస్తం
కూల్చిన ఎదనుంచి
చిందెను రక్తపు బిందువులు
చెదరెను భారత స్వప్నాలు -

మూగవోయిన నోటినుంచి
మోడువారిన తోటనుంచి
ఎగసిపోయెను మౌనసీమకు
హరే రామచిలుకలు
అమృతరాగ కోకిలలు -

సామ్రాజ్యవాద భూతాన్ని
సమరోన్మాద ప్రేతాన్ని
గజగజ గజగజ లాడించిన
చిత్తు చిత్తుగా ఓడించిన
ఊతకర్రయూ జారిపోయినది
తాత చేతినుంచి, గాంధీతాత చేతినుంచి..... -

ఎగసిపోయిన స్వప్నరేఖలు
ప్రగతి పక్షులై దిగివస్తున్నవి
చెదరిపోయిన రామచిలుకలు బెదరిపోయిన గానకోకిలలు
గుండె గుండెలో గూళ్లు కట్టుకొని
చల్లెను జీవనరాగాలు -

తాత చేతిలో ఆడిన కర్ర
జాతికి జీవగర్రయైనది
బాపూజీ ఎదచిందిన రక్తం
భారత భాగ్య విభూతి యైనది

# వేకువ పడవ

వేకువ పడవ ఎక్కించావు
చీకటిలో ముంచేశావు
నింగి శిఖరముల కెత్తేశావు
నేలమీద పడద్రోశావు

నీవూ నేమూ ఒకటేనంటూ
అద్వైతం బోధించావు
మావి కొమ్మపై కూర్చుని ఎండ
మావి నాకు చూపించావు -

చకచక మెరిసే మేను చూపి
నీ చెంతకు రమ్మన్నావు
భగభగ మండే గుండెలోన
నను భస్మం చేసేశావు

నింగి నీవని నేల నేనని
దిక్చక్రం మన మన్నావు
కలయిక లేని కలయే అది అని
కడకు తెలిసికొమ్మన్నావు -

# ఒయ్యారం

ఒయ్యారం ఒలకబోయకే!
నా తల్లడిల్లు
ప్రాణాలను తీయబోవకే!

నీలాటి రేవు వద్ద
నీటుగ నిలుచుంటావు
ముల్లోకాల చుట్టూ నా
మూఢమతిని త్రిప్పుతావు -

చేతులు ఆడించు కొంచు
చేదుతుంటే బావినీరు
గుండెలో నే దాచుకొన్న
గుట్టు లాగినట్లుంటది -

కడవమీద కడవపెట్టి
అడుగులోన అడుగేస్తూ
కవ్వమట్ల నీ నడుమును
కదిలిస్తూ నడుస్తావు
కులుకుతావు ఉలుకుతావు
ఓపలేని నా చూపుల
ఊహాలెన్నో చిలుకుతావు -

నన్ను చూచి పెదవి విరిచి
వెన్ను త్రిప్పి పోతావు
కైపెక్కిన నా కన్నుల
కలలు నింపి పోతావు -

# ప్రేమ తత్వము

ప్రేమ తత్వమేమొ చందమామ వంటిది
పెరుగుతుంటె రోజురోజు పెరుగుతుంటది
కరుగుతుంటె తరిగితరిగి కరిగిపోతది -

ఆశల పరుగులకు విశ్రాంతి ఉండదు
నిరాశావాదికి ఏ విలాసముండదు
తాగుబోతు పెదాలకు తనివితీరదు
వాగుబోతు నాల్క మౌనవ్రతము కోరదు

పేక ఆడువాడు అలసిపోకడుండదు
జూదమాడు వానికే వివేక ముండదు
దోపిడికి దయాధర్మదృష్టి ఉండదు
స్వార్థానికి ఒరులమేలు తలచుటుండదు

త్యాగధనునికేమొ కష్టనష్టము లేదు
లోభికి సుఖమనుభవించు యోగము లేదు
సూరీడుకు చీకటిని చూపలేమురా
చీకటిని చీకటితో బాపలేమురా!

# పాటపై హత్యా ప్రయత్నమా!

పాటపై హత్యా ప్రయత్నమా
వెలుగు కోటపై తమసాధిపత్యమా!

శిశిరాల చేష్టలకు చరమగీతము పాడు
మత్తకోకిలకేమొ మరణ దండనమా!
జనవాణి వినిపించు రణనాద గళముపై
నిర్జీవ నిశ్చల నీరవ సమాధియా! -

దురిత దుశ్శాసన దుర్మార్గ పీడనల
ఎదిరించు పంచమశ్రుతికి వనవాసమా!
ఆ బాల గోపాల
మాదరించే అభయ
గీతికా యాజ్ఞానికే అసురభయమా! -

అరుణోదయమునైపు
చరణాల నడిపించు
పల్లవుల ఉల్లములపై శిశిర ఘాతమా!
త్యాగమే రాగమై
ఆగ్రహావేశమే అక్షర పతాకమై
ఉద్యమించిన బ్రతుకుపై అశనిపాతమా! -

# ప్రేమించు ప్రియతమా!

ప్రేమించు! ప్రియతమా ప్రేమించు!
నిను కామించిన నన్ను ప్రేమించు!
నా మనసును నా తనువును నా బుద్ధిని
నీ ప్రణయామృతంలో కరిగించు -

నా జీవితాన్ని మథించి
ప్రేమ కలశంగా మార్చి
అందిస్తున్నాను నీకు ప్రియతమా !
ఆస్వాదించుము రసామృతములా!
కాలాన్ని నీ కన్నులలో మోడ్చి
నీలాకాశం వైపు నీ శిరసెత్తి
ఆస్వాదించుము ప్రాణ ప్రియతమా!

తోలు బొమ్మనా కాదిప్పుడు నేను
నీ ప్రియనామార్చనలో నే మోహనలక్ష్మిని
నీ మధురారాధనలో
నే అజేయ శక్తిని -

నీ విచ్చిన క్రొవ్వలపుల
పారిజాత పరిమళాలు
ఊయలవలె ఊగునులే నా ఊపిరులందు
నీ ముద్దులు మూటగట్టుకున్న
నా కళాంగాలు
పరవశించి పోవునులే
నీ రాసక్రీడలందు -

# శ్రమశక్తితో దేశభక్తి

శ్రమశక్తితో దేశభక్తికూడి
జన్మభూమికి ఎత్తె చేతనా కేతనం
సాగివచ్చే నవచరిత్రకేమో
స్వాగతము పలికెను యువకోకిలం -

ఏనాడు కనలేదు
ఈ జనాంతర శోభ
అపురూపమై పొంగు ఆత్మవిశ్వాసము
అభినందనలు పలుకు
సుమగంధములు చిలుకు
పల్లె పల్లెకు విస్తరిల్లు ఆశాలతలు -

నూతన సత్యాలు కనలేని వారు
పాత విశ్వాసాల విడలేని వారు
మధుమాస మనగానె బెదరిపోతారు
మార్పు తీర్పును విని మతికోలుపోతారు -

చేదు తీపి  పులుపు చేయి చేయి కలిపి
చేసిన ఉగాది పచ్చడి పుచ్చుకొమ్మంటే
నమ్మకములేని వాళ్ళకేమొ భయము
సమ్మతముకాని సుభ్యుల కయోమయము

# నీ మోవి నా మోవి

నీ మోవి నా మోవి
నింగి నేలలుగా
కలిసి పోయినవిలే సఖియా!
నీ ఆత్మ నా ఆత్మ ఆనంద దిక్చక్ర
మైపోయె చిత్రముగ చెలియా!

సత్యగానవు నీవు
నిత్యగానము నేను
సాహిత్య సంగీత సంయోజనము పోలె
సంచరించాము సరసానంద సరసిలో -

భాషలకు అందని భావచకోరాల
మైపోయినాములే అనుభూతి గగనాన
డెందాల నద్దుకున్నాము వెన్నెలలోన -

నరులమో సురలమో
పక్షులమొ చుక్కలమొ
అర్థమ్ము కాకనే నవ్వినది నడిరేయి
అర్థమైన ట్లాలపించినది మధుపాయి -

విజ్ఞాన ప్రజ్ఞాన విశ్వవీధులలోన
విహరించు మనకు పెట్టిన పే రదేమిటో
ఇది విలాస మ్మనగ మన ఊ రదేమిటో!

# నీ వెన్నుపూసలో

నీ వెన్నుపూసలో నే పన్నగమును
కుండలీకృతమైన కువలయాండమును -

కనుమూసుకుంటివో
కనుపింతు నేను,
చెవులు మూసితివేని
వినిపింతు నేను
కనిపించి వినిపించి నడిపింతు నిన్ను -

భౌతికాకృతివీవు ప్రాణమును నేను
మురజము మురళి వీవు గానమును నేను
నిశ్శబ్ద నిశ్శబ్ద నిద్రాణ జలధికి
జీవన రాగము నేర్పింతు నేను -

నగ్న వేదికవు నీవు
నాట్యమును నేను
భ్రమణ చక్రము నీవు
విద్యుత్తు నేను
మెరుపు నాట్యాలలో అంధకారాలకు
దిక్కు చూపెడి కాల ఋక్షమును నేను
విశ్రామవన కల్పవృక్షమును నేను

# గాలికి వీచుట ధర్మం

గాలికి వీచుట ధర్మం
ఏరుకు పారుట ధర్మం
పక్షికి ఎగురుట పాముకు ప్రాకుట
ప్రకృతి సిద్ధమౌ ధర్మం -

మబ్బుకు కురియుట ధర్మం
మంచుకు కరుగుట ధర్మం
నెమిలికి ఆడుట
పికముకు పాడుట
ఏనాటికినీ ధర్మం -

పూవులు వాడుట ధర్మం
నీవూ నేనూ కూడుట ధర్మం
చెలికాడా నీ శక్తి రహస్యం
చెప్పుటయే నా ధర్మం -

నాలో దాగిన అహంభావము
అణచివేయుటే నీ ధర్మం
నీలో పెరిగే ముభావము
తొలగించుట నా ధర్మం

కలలో కూడా నీ కౌగిటిలో
కరిగిపోవుటే నా ధర్మం
నా కలలను వాస్తవమొనరించే
కళా శక్తియే నీ ధర్మం
విలాసమే?

# కూలివాడు

కూలివాడు మేడ కట్టుకునే
రోజు రావాలి
బక్కరైతు బెన్జుకారు
ఎక్కురోజు రావాలి!

రైలుగాని బస్సుగాని
రాచ విమానాలు గాని
ప్రకటించిన వేళలకు
రావాలి - పోవాలి!

ఒకటి కొకటి పొంతనగా
త్రికరణాలు మెలగాలి
బేలు - జేలు గొడవలేని
రాజనీతి వెలగాలి!

శ్రమశక్తికి ధీశక్తికి
సమఫలితం అందాలి
చీకటి చెరమండి వెలుగు
చిర విముక్తి పొందాలి!

నిజమయ్యే కలలు కనగ
కనులు, నిద్రపోవాలి
మాయమత్తులో చిక్కిన
మనసు మేలుకోవాలి!

# గాలిలో ఎగిరేటి పక్షి

గాలిలో ఎగిరేటి పక్షిని
పంజరంలో త్రోసినారా
కడలిలో తిరుగాడు చేపను
కడవలో పడవేసినారా!

కొడవలిని ఝళిపించి ఎవ్వరు
కొమ్మలను పూయించగలరు?
నెమలితో, భయపెట్టి ఎవ్వరు
నర్తనం చేయించగలరు?

రాయిరప్పలు అడ్డుకున్నా
కొండకోనలు కోపగించిన
గుండె పగిలే ఎండ తగిలిన
బ్రతుకునే శ్రుతిచేసి పాడె
ఏరు ఆపునె ఎడదపాట!

పదవులెన్ని పట్టి ఇచ్చిన
ముడుపులెన్ని ముట్ట చెప్పిన
ఎన్ని ఆశల ఎరలు చూపిన
దేశభక్తుడు త్యాగశక్తుడు
శత్రువులతో చేయి కలుపునె
కన్నతల్లికి చిచ్చు పెట్టునె!

# నీ బిగి కౌగిలి

నీ బిగి కౌగిలి వింటిలో
బాణంలా నను సంధించు!
రసానంద శిఖరాల పైకి
లాఘవమున ప్రయోగించు!

స్పందించే నీ పెదవులతో
శంఖంలా నను పూరించు
భూనభ భేదక నాదంలా
నా తను కాహళి మ్రోగించు -

సాగిల్లే నీ చేతులపై
చక్రంలా నను త్రిప్పుమురా
ఇహపర సుఖములు సాధించే
రహస్యాల ముడి విప్పుమురా!

ఏమి చేసినా సరే నన్ను నీ
ప్రేమార్ణవముగ మలచుకో
పరవశించిన నా ఒడినుండి
పంచప్రాణములు చేదుకో!

# కాకి కేకి కోకిల

*కాకి కేకి కోకిల*
*కలిసి మెలసి ఉండాలి!*
*సమతా మమతల నవతల*
*కొమ్మల జతకూడాలి!*

*నవయుగ ధర్మంలో*
*నా, నీ భేదాలెందుకు?*
*అనంతాన అణువులకై*
*స్వార్థపరత్వాలెందుకు?*
*ప్రగతి పాత్రలో అందరు పాలే పోయాలి!*
*నీరు పోసి జారుకొనే చోరనీతి మానాలి!*

*మంచి చెడులు తెలిసియు*
*నిజానిజా లెరిగియు*
*తప్పొప్పులు చెప్పగలిగి*
*ఆత్మవంచ నెందుకు?*
*కష్టమైనా నష్టమైనా న్యాయముకై నిలవాలి*
*తన సుఖమే సర్వ మనుకొను తత్వము విడనాడాలి*

*ఒంటరి నని అనుకోకు*
*ఓడిపోదు ననుకోకు*
*గొర్రెదాటుగా కాక*
*బుర్రను ఉపయోగించు*
*వివేకమును కోల్పోయిన విజ్ఞానం వృధా వృధా*
*నిజాయితీని విడనాడిన ప్రజాసేవ దగా దగా!*

# చెలియా!

చెలియా
నీ ఆపాదమస్తకం
సౌందర్యం గూర్చి నేను
చదువుకునే పుస్తకం!

కలలో నాకు
కాముడు కనిపించాడు
బ్రహ్మదేవుడు కూడ భావించలేనట్టి
సుందరిని వర్ణించి చూపుమన్నాడు
కఠినమైన పరీక్ష
కల్పించిపెట్టాడు -

లెక్కలేని గ్రంథాలు పరీక్షించాను
చక్కని చిత్రాలెన్నో వీక్షించాను
కాముడు నిర్దేశించిన కామిని కనబడలేదు
బ్రహ్మకూడ మూర్చిల్లే భామ జాడయే లేదు
అయినా నా అన్వేషణ
ఆపలేదు సఖియా!

చుక్కలనే వెక్కిరించు
చూపులు రువ్వే కళ్లు
వేయి వసంతాల రవళి
వ్యంజించే గళము
భగవంతునికన్న మున్నె
ప్రభవించిన వెలుగు
కలబోసిన నిన్ను చూసి కవిత అల్లినాను
కాముని కామన తీర్చి ధన్యుడ నైనాను

# కోకిల పాట

కోకిల పాటలకేమో
కొత్త పల్లవాలు
కూరుస్తున్నాయి కొండ కోనల్లో చెట్లు!

విలయ శిశిరమును తరిమిన
వీరమారుతాలకు
స్వాగతాలు పలికేను
సదావేశ పుష్పాలు
జయానంద బాష్పాలు -

అడివి కడుపులో రేగిన
ఆకటి గర్జన విని
వేకువ దూసుకవచ్చెను
విప్లవ తీరంనుండి
తూరుపు ద్వారం నుండి -

మోసాల వలల చిక్కని
మోదుగు సుమహాసాలు
పూరించెను తేజోమయ శంఖాలు
నడిపించును సమదర్శన చక్రాలు
వెలిగించెను విజయీభవ దీపాలు -

# ఎన్నికలలో ఎన్ని కలలో!

ఎన్నికలలో ఎన్ని కలలో!
ఒక్క చేపకై ఎన్ని వలలో!

ఓటర్ల కడలి బడిలో
ఎన్ని అవినీతి అలలో
ఎన్ని ఆవేశాల సుడులో
మోసాల మొసళ్లెన్నో
అభ్యర్థుల పడవ మునకలెన్నో!

రాజకీయ స్వయంవరంలో
అధికార పాణిగ్రహణంలో
ఎన్ని ధనుర్భంగాలో
ఎన్ని శృంగభంగాలో
వారసత్వ యోగ్యత
హక్కులకే దక్కునో
యుక్తులకే చిక్కునో
పాదుకాపట్టాభిషేకాలు
కీకారణ్య వాసాలు
ఎన్నో! ఎన్నెన్నో! -

ప్రజాస్వామ్య క్షీరాంబుధి
మహామథన యజ్ఞంలో
అమృతంలో తేలే దెవరో
హాలా హలమున కూలే దెవరో!
ఎన్నికల కలలలో
ఎన్ని సత్యవీచికలో
ఎన్ని మరీచికలో
ఎన్ని సమాధానాలో
ఎన్ని శేషప్రశ్నలో!

# ప్రేమకు ఒక రూపం

ప్రేమకు ఒక రూపం లేదు
నింగికి ఒక తీరం లేదు
సృష్టిని నడిపించే ఈ
రెంటికి నిర్వచనం లేదు -

ప్రేమ ఏదో శబ్దం కాదు
నింగి రంగు నీలిమ కాదు
భాషకు భావానికి చిక్కని
అనుభూతికి సాక్ష్యం లేదు -

వద్దంటే విడిపోయేది
రమ్మంటే జతకూడేది
ఎటు అంటే అటు మారేది
కాదయ్యా ప్రేమ అనేది -

నేర్చుకుంటే అబ్బేటి
విద్య కాదు ప్రేమ
మబ్బువోలె వచ్చిపోవు
మాయ కాదు ప్రేమ

ఎందుకు ప్రేమిస్తున్నావో
ఎరిగిస్తే అది వ్యాపారం
హేతువు లేక వెలిగే
జ్యోతే సుఖసంసారం -

# నీ కళ్లల్లో

నీ కళ్లల్లో కలలున్నాయి
నీ చూపుల్లో వలలున్నాయి
కలల వలలు వేసి నన్ను
కట్టి వేయకే చెలీ!

నీ నవ్వుల్లో పూలున్నాయి
నీ అధరంలో సుధలున్నాయి
తేనె సోనలో నను ముంచేసి
గెలిచేయకే బాలా!

నీ నడకల్లో లయలున్నాయి
నీ విరుపుల్లో శ్రుతులున్నాయి
శ్రుతిలయనాదస్వర ఝరిలో
నామతి బోగొట్టకె సఖియా!

నీ తనువెల్లా లత లున్నాయి
లతలలపై ఫలశ్రుతు లున్నాయి
సుందర సుమఫల బృందావనిలో
రాసక్రీడ లాడుదమా దేవీ!

# రజత కవచధారిణీ

రజత కవచధారిణీ
పసిడి పసుపు ఆమనీ
కుంకుమాభ శోభినీ
క్షీరాభిషేక పావనీ!
కనకమహాలక్ష్మీ!

నీలాంబర వర్ణినీ
లీలాబుజ పాణినీ
సాగరతటి వాసినీ
సర్వలోక జననీ! కనకమహాలక్ష్మీ!

భవభయార్తి హారిణీ!
తాపత్రయ వారిణీ
సద్గుణ గుణ కారిణీ
కరుణాదృక్ వాహినీ! కనకమహాలక్ష్మీ!

అష్టలక్ష్మీరూపిణీ!
అభ్యుదయోద్దీపినీ
బురుజుపేటనే వికుంఠ
పురము చేసి ముజ్జగాలు
పాలించే పరమేశ్వరి
కనకమహాలక్ష్మీ!

# కాంతితోడ

కాంతితోడ నీ కళ్ళు కడుక్కో
శాంతి తోడ నీ మోము దిద్దుకో
ఉషోదయం అయిపోతావు
రసార్ణవం అయిపోతావు -

దరహాసం నీ మోవి చేసుకో
దయాగుణం నీ చూపు చేసుకో
ఖాండవ వనమైపోతావు
కల్పవృక్షమై పోతావు -

ప్రేమను నీ పరిభాష చేసుకో
స్నేహము నీ అభిలాష చేసుకో
దేవదూత వైపోతావు
దేశనేత వై పోతావు -

త్యాగమునే నీ ధనము చేసుకో
సేవను నీ ఆశయము చేసుకో
కుబేరుడవు అయిపోతావు
మారుతివైపోతావు -

సత్యమునే నీ మతము చేసుకో
సమభావము నీ హితము చేసుకో
దేవుడ వైపోతావు
శ్రీరాముడ వైపోతావు

# నీ నడుము

నీ నడుము నాచేయి, నా నడుము నీచేయి
పెనవేసుకొని పోయినాయి
సైకతాలలో వైశాఖ
పూర్ణిమలు స్పందించినాయి -

మనచేతి వేళ్ల కొసలే సకలలోకాలు
స్పర్శించినట్లుగా స్వప్నాలు కన్నాము
నిదుర లేచిన జలధి
మన  కలల భాషకు
భాష్యమ్ము చెప్పినటు
భావించుకున్నాము -

నీ మధ్య నా మధ్య నిశ్శబ్ద భావాబ్ధి
నీ వెవర వంటేను నీ వెవర వన్నట్లు
ఎక్కు పెట్టాములే ఇరువురము కనుబొమలు
ముసిముసిగ నవ్వినవి
ఇసుక తెర వెండిమలు -

ఒకరిలో ఒకరివి
ఓరగా చూచుకొని
ఉలికిపడి తేరుకున్నాము
ఒక మీన మిథునము
ఒక తారకల జంట
మన కనుల కడలిలో కదలాడె నన్నావు
నిరుపమానులకు మన ముపమాన మన్నావు

# భారతీయ విద్యా భవనం

భారతీయ విద్యా భవనం
బాలబాలికల పూలవనం -

ఇక్కడి చక్కటి వాతావరణం
శివసుందరము జగన్మోహనం
సిరి చిరునవ్వులు కళకళలాడే
చిరంజీవుల శక్తి తోరణం -

కులమతవర్గ విభేదం లేదు
కలహాలకు తావసలే లేదు
నవయువతా స్వప్నాల కోటలో
భవిష్యత్తుకు భయమే లేదు -

ఆటపాటల తోట ఇది
అనురాగాల మూట ఇది
సమైక్య భారతి రూప మిది
చదువుల తల్లికి దీప మిది -

బాలకృష్ణులు యశోరాములు
దివ్య ప్రతిభాదేవి కుమారులు
స్నిగ్ధహృదయులు ప్రియభాషణులు
వర్ధిల్లే విజ్ఞానాలయ మిది
రంజిల్లే నవరత్న ఖని ఇది -

# అలరు దండ

అలరుదండ నీకిస్తే వలదన్నావు
కలనైనా నిను కన రావల దన్నావు -

అలరుదండ కావాలని
అడగలేదు నీవు
నీవే కావాలన్నది
ఆ పూవుల మాలే! -

చల్లని ఆ సంజవేళ మల్లెమాల నీ కిస్తే
ఒల్లనవి అన్నప్పుడు ఒళ్లు ఝల్లుమన్నది
చిలుకలాంటి నీ మోము సింగములా గున్నది
చివురించే నా ఎదలో శిశిరము నెలకొన్నది -

నీ నల్లని జడల పొందు కోరుకొన్న ఆ మల్లెల
అభిరుచి నభివందింతును
నీ చెంత చేర్పు మని
ఈ అదృష్ట హీనుని
అడిగిన ఆవిరిదండ అమాయికతకు చింతింతును -

నీవంటే ఆపూలకు నిలువెల్లా అభిమానం
పూలంటే నాకో మతిపోయే అభిమానం
కాని మిమ్ము కలుపలేక
పొందితి అవమానం
అయినా ఆ అనుభూతే ఈ గీతికి ప్రాణం

# అనంతాన్ని

అనంతాన్ని సృష్టించిన
ఆదిదేవు డుండుటకు
మానవ హృదయం తప్ప
మరోచోటు లేదురా!

రంగులు రూపాలన్నీ
సింగారాలన్నీ
కంటిచూపు లేకుంటే
కల్లయేగదా!

అత్తరులుకు, ఘుమ ఘుమలకు
మత్తుగొలుపు వాసనలకు
దిక్కు లేదుగా!
మనిషికి ముక్కొక్కటి లేకుంటే

కరుకుదనం, మెత్తదనం
చురుకుదనం మనుపుదనం
చేయి స్పర్శ లేకుంటే మాయయే గదా!

చేదు, తీపి, పులుపు, ఒగరు
చిత్రమైన రుచులన్నీ
నాలుకొకటి లేకుంటే నగుబాటేగా!

వాక్కులు వాయిద్యాలు
స్వరగతులు రాగాలు
సంగీత సుధాధునులు
చెవియే లేకున్న, మూగ చేష్టలేగదా!

పంచేంద్రియాలు లేక ప్రపంచమే లేదు
నశ్వరమౌ తనువు లేక శాశ్వతాత్మ లేదు

# ఎవరిచ్చినారో!

ఎవరిచ్చినారో నీ కిన్ని అందాలు
పట్టుకొన చాల నీ పంచేంద్రియాలు -

ఆడితే నీ అడుగు అడుగులో అందం
పాడితే నీ పలుకు పలుకు మకరందం
మాటాడినావొ సెలయేటిదౌ అందం
మౌనము వహించావొ మంచుమల అందం -

ఊపిరి పీల్చావొ ఊరించు అందం
చిరునవ్వు రువ్వితే క్షీరాబ్ధి అందం
వినుతాకగానె నా విలువెల్ల పులకలు
పారవశ్యమున నా తనువెల్ల మెలికలు-

కోపగించిన యపుడు మలిసంజ అందం
శాంతించినపుడు శారదరాత్రి చందం
అలిగినప్పుడు ముకుళితాబ్జమ్ము నీవు
పరదాగ ఉంటె వికసిత పద్మ మీవు -

గరుడ కిన్నెర యక్ష గంధర్వ కళలు
పాదుకొన్నవి నీ ఆపాదమస్తకము
అల్లుకొనిపోయె నీ అంగాంగములను
నీవె లేకుంటె నా అందాల వృష్టి!
కనులు లేని కబోది కాదె ఈ సృష్టి!

# నీ తలపుల వేణువు

నీ తలపుల వేణువులో
నా హృదయం చిక్కుకుంది
ఎలా ఊదినా అది
నా పాటే అవుతుందిరా!

నీ జీవిత వృత్తంలో
నే అదృష్ట కేంద్రాన్ని
నీ భాష నీ భాష్యం నీ భావం ఏదైనా
నా తత్వమె ఎరిగించును
నా చుట్టే భ్రమియించును -

నీ గమనానికి గమ్యం
నేనే అయిపోయాను
నీ రధము నీ పథము
నీ పాత్ర నీ యాత్ర
ఏదైనా చివరకు అది నా ఒడిలో చేరుటకే -

నీ ఊహా చిత్రంలో
నా రూపమె దాచితిని
ఏ రంగులు ఏ రేఖలు
ఎటువేసిన ఎటు గీసిన
నా రూపమె అవుతుందని
తెలిసికో ప్రియతమా!
నను ఏడ్పించుట కాదే
నాటకాలు మానుకో!

# సాగిపోయె నీ మరాళయానం

సాగిపోయె నీ మరాళయానం
మోగిపోయె నా అరాళగానం
ఎటుగొనిపోదువో ఎరుగను నేను
ఏమి పాడుదునో ఎరుగవు నీవు -

పిటపిట లాడెను
మిటమిటలాడెను
నా హృత్ పటము
తళతళలాడిన నా కన్నులలో
కళకళలాడెను నీ సోయగము -

ముందు చూచినా వెనుక చూచినా
క్రిందు మీదుగా ఎటు చూచినను
కనుపించినిది ఖగోళ మొకటే
నిజమైనది నీ విలాస మొకటే -

చీకటిలో పెనుచీకటి నైతిని
వేకువకోసం వెదకితి వెదకితి
మెరిసిపోయె నీ చిన్మయరూపం
మురిసిపోయె నా మృణ్మయదీపం

# తోట పాట

తోట పాట పాడుతూంది
క్రేటుకొని
ప్రకృతి పరవశిస్తూంది
పాట విని -

సాహిత్యం సంగీతం
సారూప్యమైన పాట
కాలం దేశం కలిసి
సాలోక్యమ్మైన పాట -

వింగి నేల అలుముకొని
నిరూపించె సామీప్యం
నీవూ నేనూ ఒకటై
నిలిచినట్టి సాయుజ్యం -

అణువణువున కొత్తకొత్త
అనుభూతుల ఆమని
చతుర్విధ ముక్తులను
నుతియించే గాయని -

సాలోక్యం సామీప్యం
సారూప్యం సాయుజ్యం
సంపదలన్నీ మనవే
సానుభూతితో రావే
అద్వితీయ అద్వైతము
అనుభవింపరావే!

# రాసుకున్న పాటలు

రాసుకున్న పాటలన్ని వాసికెక్కవు
నాటుకున్న మొక్కలన్ని రాశికెక్కవు -

కాలమెంత ఉన్నా
బ్రతుకు కాలము కొంతే
దేశమెంత ఉన్నా
మనషి వాసము కొంతే!

చదువుకున్న దెంతైనా
సంస్కారము కొంతే
తెలసిన దెంతున్నా
మరుపురానిది కొంతే!

కోరే కోరికలెన్నో
తీరేవి కొన్నే
ప్రయత్నాలు ఎన్నెన్నో
ఫలించేవి కొన్నే ! -

పోటీ పడునవి ఎన్నో
గెలిచేవి కొన్నే
లక్షలు లక్షలు మాటలు
అక్షరాలు కొన్నే

# చీకటిలో

చీకటిలో పెనుచీకటినై
వేకువకోసం వెదుకుటయా!
మంటలలో చిరుమంటై నేను
మంచుకోసము తపించుటయా!

అనుమానమునే అనుమానించే
మనస్తత్వమును పెంచుకొని
కనపడుతున్నది సత్యము కాదని
కనబడదానిని నమ్ముటయా!

ఉన్నది లేదను లేని దున్నదను
ఉన్మాదము పోషించుకొని
ఉన్నది - లేనిది కాక మరేదో
ఉన్నదియని భావించుటయా!

మతాలన్నియూ మంచివేయని
"పరమత"ముల ద్వేషించుటయా
మనుషులందరూ ఒక్కటేయని
మానవులను విభజించుటయా!

స్త్రీలపట్ల వివక్ష కూడదని
సిద్ధాంతము బోధించుటయా
స్వేచ్ఛకంటే విధేయతే
స్త్రీ ధర్మముగ విధించుటయా!

# నా ఎదలో నైలునది

నా ఎదలో నైలునది నాదం చిలికించి
పిరమిడుల ఎడారిలో ప్రేయసి పలికింది -

వలపు యాత్రల గూర్చి
క్లియోపాత్రల గూర్చి
సతి నిమిత్తమై రగిలిన సామ్రాజ్యాలను గూర్చి
గుసగుసలాడెను నాతో
గత చరిత్ర గంధవహం - - -

తెలుపూ నలుపూ లేని
తూర్పు పడమరలు లేని
భాషా ద్వేషము లేని
వాద వివాదాలు లేని
నాగరికత నవ సంస్కృతి నా కృతిగా భాసించెను -

కాలవాహిని పోలె
కదలిపోవు నైలునది
మధుర స్మృతులు నిండిన
మధ్యధరా సాగరం
పరవశించె నే పాడిన
కలల అలల పాటలో
కలిసిపోయె ఇన్నుమిన్ను
నా చూపుల కొసలలో

# ఊరించే ఊహాలు

ఊరించే ఊహాల
వారించే వాస్తవాల
నడుమ నలిగి పోతున్నది
నా జీవన నౌక!

అనుమానం వెంటాడును
ఆశలను
బుద్ధిని నిద్దుర పుచ్చును
బద్ధకము
ప్రయత్నాన్ని పీడించును
పిరికితనం
అడుగడుగున జీవితాన అసంగతం

ఆత్మమాట సాగనీవు
ఇంద్రియాలు
అనుభవాల కంటపడదు అనుభూతి
అన్నీ నేనె అంటుంది ఆత్మవాణి
ద్వైతాద్వైతుల కలుపుదారి లేదు

ఆవేశం కలిగినపుడు
ఆలోచన రాదు
ఆలోచన వెలిగినపుడు
ఆవేశం లేదు
ఆవేశం ఆలోచన
అన్యోన్యంగా ఉంటే
జీవిత దేవతకంట కన్నీరే లేదు -

# నీ తలబంతి

నీ తలబంతి జడలు జఘనము
వీణ రూపము వహించినవి
మూగవోయిన నా మానసమున
రసరాగము మ్రోగించినవి -

నీ గళశంఖం నీ ముఖచక్రం
నను వేధించే కుసుమాస్త్రునికి
నిశితాస్త్రము లందించినవి
పట్టుదప్పి నా పంచప్రాణములు
నిన్నే ఆశ్రయించినవి -

శ్యామల చోళము అరుణిమచేలమ
నీ రూపమును ప్రదర్శించె
నీ తను రేఖాగణితము గుణితము
నిరుపమ జగాలు సృష్టించె -

తోలుబొమ్మవని ముద్దుగుమ్మవని
తొలుత నేను అనుకొంటి
కాని అందులో సృష్టిమూలమౌ
కాంతి నేడు కనుగొంటి -

# ఆత్మవు నీవు

ఆత్మవు నీవని తెలిసికో
జీవాత్మవు నీవని తెలిసికో

నిర్మల నిశ్చల శాంతిమయంగా
నిరుపమ నిర్గుణ కాంతిమయంగా
పరంజ్యోతి పరమాత్ముని సన్నిధి
ప్రకాశించెడి తారవు నీవని తెలిసికో -

ఫాలభాగమున లీలగ కూర్చుని
ప్రాపంచిక జీవితమును గడిపే
పంచేంద్రియ రథసారథి నీవని
పవిత్ర చిరంతనాత్మవు నీవని తెలిసికో

మహత్వ స్వభావ గుణాలు మరచి
మాయలోన పడి విలవిల లాడకు
రాజయోగమున తేజో లోకము
దర్శించుము ఆనంద బిందువై
సత్య యుగానుభూతి బృందవై!

అబూ శైల శిఖరామృత ధామం
పరమ పితా శివబాబారామం
ఈశ్వరీయ విశ్వవిద్యాలయం
రాజయోగ రసమురళీగానం
విశ్వేశ్వరునికి నరునికి మధ్య
శాశ్వత ఇహపర సుఖ సోపానం.

# దేశమును ప్రేమించు

(గురజాడ మనోవేదన)

దేశమును ప్రేమించు మంటిని
మంచియన్నది పెంచుమంటిని
నాటికిని నేటికిని అదియే
మాట అనుచుంటి -

స్వార్థమే పరమార్థ మైనది
సమత ఎండమావి యైనది
నీతి అంటే అర్థము అవి
నీతి యని యేనా!

చిత్తశుద్ధి విధానమైతే
త్యాగగుణము ప్రధానమైతే
సంఘ సంస్కరణం అపుడే
సాధ్యపడునండీ!

నాడు ఇది పరతంత్ర దేశము
నేడు సర్వ స్వతంత్ర దేశము
స్వర్ణ భారతి ప్రగతి స్వప్నాల్
సఫలమౌగాక!

# ఒక తార

## (డయానా స్మృతిగీతి)

ఒకతార రాలిపోయింది
కాలచక్రము క్షణము ఆగిపోయింది -
వేల స్వప్నాలు త్రుటిలో కూలిపోయినవి
కారుచీకట్లలో కలిసిపోయినవి -

సిరిసంపదలకన్న స్వేచ్ఛయే మిన్నయని
స్వార్థ సుఖముల కన్న సేవయే శ్రేష్ఠమని
భావించినదిలే డయానా
జీవించినది నిర్భయాన -

రాణివాసము వీడి రాణించెను డయానా
పేదసాదల ప్రజల ప్రేమించెను డయానా
కోటికోటి ప్రజల నోటిలో కన్నీటి
పాటయైనది దయామయి డయానా -

చిత్ర ఛాయాచిత్ర జీవిత యాత్రలో
తెలిసి తెలియని గమ్యమును చేరుకొనబోయి
దారిలోనే మాయదారి విధిచేతిలో
చితికిపోయిన యశోవతియే డయానా
మానవత రాజ్య యువరాణియే డయానా

థేమ్సునది ఒడ్డుపై
చరిత్ర గడ్డపై
వాడిపోవని పూలమేడయై పోయె
ఆరిపోవని దీపస్తంభమై పోయె!

# ఆరాటం

ఆరాటం పోరాటం
అంతవృధా పరుగేనా !
అలికము పై వ్రాసినదే
అక్షరాల జరిగేనా !

ఏ దారిని పోయినా
ఎంత శక్తి కలిగినా
కడలి దాటిపోలేవు కదా
నదీనదాలు
ఏటి బ్రతుకులన్నీ
ప్రాయేట చితికి పోవుగదా !

గర్జించుచు, విద్యుత్తులు
గండూషించే మబ్బులు
నగాకృతులు దాల్చి
భూనభాల అదరించ నెంచి
ముక్క ముక్కలై పోయి
ఎక్కడెక్కడో కూలును

భూచర జలచర ఖేచర
భూరుహ కోటీల బ్రతుకుల
జనన మరణ వృత్తాలను
నిర్ణయించు కాలాన్ని
నిలదీసే దేవరు?
ప్రశ్నించే హక్కులేని
విధులను పురమాయించే
నిరంకుశ నియంత విధిని
నిర్దేశించేదెవరు ?

# పురుషోత్తముడు

పురుషోత్తముడు వెలిసిన
పూరీక్షేత్రం
తూరుపు తీరం తెరచిన
తారక నేత్రం -

సోదరీ సోదరులు
సుభద్ర బలభద్రులు
తోడుగా వెలసిన
నీల మాధవుడు
లీలావతారుడు -

గిరిజనులు పురజనులు
రారాజులు నిరుపేదలు
ఆబాల గోపాలం
ఆరాధించే దైవం
అఖిల జగన్నాథుడు -

అడవిచెట్టు బోదెనుండి
భక్తికళా శక్తి చెక్కి
తోడుకున్న అమృతమూర్తి
తురీయచేతన స్ఫూర్తి
పరాత్పరుడు, శివంకరుడు
శుభంకరుడు, సుదర్శనుడు -

నింగిని నేలను కలిపే
శంగాలయ వాసుడు
దేశ విదేశాల చేర
దీసెడి సుగుణవిలాసుడు
పురుషోత్తముడు వెలసిన పూరీక్షేత్రం -

# కోహం కోహం?

కోహం ! కోహం ! అనే
కోకిల ప్రశ్న
కోటి కోటి ప్రశ్నల
పదకోశముగా మారె!

చెట్ల మీద ఉదయించును
చిగురాకు ప్రశ్నలు
నేల మీద రాలిపడే
పండుటాకు ప్రశ్నలు

సిగ్గు విడిచివేసే
పూమొగ్గల రంగుల ప్రశ్నలు
అడవిలోన గర్జించే
ఆగ్రహోగ్రాగ్ర ప్రశ్నలు
ఆటలాడు పసిపిల్లల
నోటికి వచ్చిన ప్రశ్నలు
పాడెమీద కళ్లు మూసి
కాటికి వచ్చిన ప్రశ్నలు -

ఆకసాన లెక్కలేని
చుక్కల చూపుల ప్రశ్నలు
నేలమీద దిక్కులేని
హక్కుల పడికిలి ప్రశ్నలు

పండితులు ఝుళిపించే
పారమార్థిక ప్రశ్నలు
పామరులు పలవరించు
ప్రాథమిక ప్రశ్నలు -

బడులకు గుడులకుతెలియని
ప్రశ్నల పత్రమును చూచి
ప్రకృతి ఉలికిపడుతూంది
కాలం కలవర పడుతూంది

# భాష నన్ను నడుపుతూంది

భాష నన్ను నడుపుతూంది
భావం నను నడుపుతూంది
శబ్దం నను నడుపుతూంది
నిశ్శబ్దంలోనికి -

నిశ్శబ్దంలో నుంచి
శబ్దం పుడుతున్నది
వెనువెంటనె చితికిపోయి
నిశ్శబ్దం అవుతున్నది

క్షణికమైనది శబ్దం
శాశ్వతమో నిశ్శబ్దం
క్షణక్షణ శబ్దాల మధ్య
సృజనాక్షర నిశ్శబ్దం
నిశ్శబ్ద స్థితి నుండి
నిశ్శబ్ద స్థితికి చేరు
శబ్దం ఒక శంపాలత -

శబ్దము నిశ్శబ్దము
కాలాబ్ధితరంగాలపై
శ్రుతి స్మృతి సంహిత స్థితులై
మృతామృత సృతానృత
ఋగ్వేదాకృతులై
పాడేను ఆడేను
సప్త చేతనకృతులై
సప్త లోకానుభూతులై

# చెట్లు రచిస్తున్నాయి

చెట్లు రచిస్తున్నాయి
చిగురు పాటలు
మైమరచి పాడుతున్నాయి
మావి తోటలు -

ద్వంద్వార్థాలు లేని
స్వాదుశీల భాషలో
సత్యాన్ని చాటిచెప్పే
చైత్రోదయ మౌతున్నది -

విలయ తాండవం చేసిన
అవినీతి శిశిరాన్ని
తరిమి తరిమి కొడుతున్నది
న్యాయవీర వసంతం;
ఆవేశం ఆనందం
అలరుదండలై పలుకును
ఆమనికి స్వాగతం -

చీకటి వని కడుపులోని
ఆకలి హరి గర్జన విని
వేకువ దూకి వస్తూంది
విప్లవ తీరాలనుండి
విజయ ద్వారాలనుండి!-

చేదు తీపి ఒగరు కలిసి
సహజీవన భావంతో
ఉమ్మడిగా చేసినట్టి
ఉగాది పచ్చడిని
సమ్మతించునో లేదో
నమ్మకములేని నోళ్లు!

# పట్టపగలు

పట్టపగలు చీకట్లు
ముట్టడించె మనిషిని
కారణమే లేక కినిసి
కాటువేసె మనసును -

మోసపోయె అతని కళ్లు
మూగవోయె అతని గొంతు
నయవంచన అతని చుట్టు
నగ్ననాట్య మాడగా
అసురత్వం విషతత్వం
అభిమన్యునివలె అతనిని
అసహాయుని చేయగా-

ధర్మాన్ని అధర్మంతో
సత్యాన్ని అసత్యంతో
కబళించ బూనింది
కట్టుకథల దుష్టమతుల
గర్వాంధకారత్వం-

బురద ఎంత చల్లినా
హిమగిరి కళ తరుగునా?
ఘూకాలు బేకాలు
కుట్రలెన్ని పన్నినా
చీకటి పొట్ట చీల్చక
వేకువ రాకుండునా!
విస్తుల ప్రతిభాపతాక
నింగినెగరకుండునా!

# మదర్ థెరెసా

మదర్ థెరెసా మన కిక లేదు
అయినా ఆమెకు మరణం లేదు -

నిరుపేదలకు, నిర్భాగ్యులకు
పరిత్యక్తులకు, బహిష్కృతులకు
ఆర్తులకూ, అనాథలకూ
తల్లియైనది తండ్రియైనది వాస్తవ కల్పవల్లియైనది -

పుట్టినదేమొ యుగస్లోవియా
మెట్టిన మమతల మట్టి ఇండియా
కట్టిన సేవాదేవాలయమున కొట్టెను విశ్వప్రేమ గంటలు -

కలకత్తాలో కాలుమోపినది నిరాధారులకు దారిచూపినది
కుష్ఠురోగులను, కష్ట దష్టులను
రోగ పీడితుల, రుజాబాధితుల
వికలాంగులను, విధివంచితులను
ప్రేమామృతమిడి పెంచిన తల్లి ,సేవా సదనాన తరించిన తల్లి -

భారతరత్న ప్రభావిలసితయై నోబెల్ బహుమతికే విద్యుతియై
కులమత జాతి వర్గాతీత
మానవతా కళ్యాణ దీపమై
వర్ధిల్లిన జయ వర్ధిని ఆమె
శోభిల్లిన గుణసుందరి ఆమె!

సప్తసూత్ర సందేశ రాగమున సుప్తజీవనుల మేలు కొల్పినది
కోటి కమల కన్నీటిని తుడిచిన మేటి మాత జనకోటి నోట
కన్నీటి పాటగా మిగిలిపోయినది -

# బాపురెడ్డి కొన్ని ముఖ్య రచనలు

బాపురెడ్డి పద్య కావ్యాలు

బాపురెడ్డి గేయ నాటికలు

అనంత సత్యాలు

మన చేతుల్లోనే ఉంది

ప్రణవ ప్రణయం

పంచబాణ సంచా

రంగురంగుల చీకట్లు

వాడిపోని వసంతాలు

కాలం మాయాజాలం

నాదేశం నవ్వుతూంది

శ్రీకార శిఖరం

ప్రేమారామం

మనసులోని మాట

**In Quest of Harmony**

**Longing for Life**

**Urn of Love**

**Loving is Living**